# ELEMENTARY BOTANY

BY

K. RANGACHARI, M.A., L.T.

*Ag. 1st Asst. Teacher's College, Saidapet.*

*TRANSLATED INTO TELUGU*

BY

S. VENKATASUBBARAMA SASTRI,

*Telugu Pundit, S. P. G. High School, Madras.*

WITH 231 ILLUSTRATIONS.



Madras:

**P. R. RAMA IYAR & Co.,**

BOOKSELLERS, PUBLISHERS & STATIONERS.

1909.

 [**Price, Rs. 1-8-0.**

# ఓషధిశాస్త్రము.

ఇది

చెన్నపురి టీచర్సుకాలేజీ ప్రొఫెసరగు

కె. రంగాచార్యుల గారిచే (యమ్. ఎ. యల్. టి.)

రచియింపఁబడి,

చెన్నపురి యస్. పి. జి. హైస్కూలు

నందాంధ్రోపాధ్యాయుండగు

యస్. వెంకటసుబ్బరామ శాస్త్రిచే.

తెలుఁగింపఁబడి,

మదరాసు:

మెస్సర్సు. పి. ఆర్. రామయ్యర్ అండు కంపెనీ వారిచే

ప్రకటింపఁబడియె.

1909.

 [వెల, రు 1-8-0.

# PREFACE.

All over the world a great deal of importance is attached to nature study. But it has yet to be introduced into schools in our country.

Nature study is most valuable regarded from the educational point of view, as it inculcates habits of exact observation and stimulates the reasoning powers. It will prove a useful corrective to the gradual decay of the power of independent assimilation and the initiative, that has set in amidst the students. So this subject ought to occupy a high place in the rank of educational subjects.

In teaching this subject it should ever be borne in mind that the main purpose of nature study is not the acquisition of mere facts about Nature, but it is, and ought to be "a training in the methods of open-eyed, close, and accurate observation especially of familiar animals and plants, which shall teach the student to see what he looks at and to think about what he sees." The teacher should not attempt to teach. The objects themselves should be the teachers, and the work of the school master lies in explaining and guiding the students.

Botany is, perhaps, best suited for the purpose, as plants are easy to get and pleasant to handle. To interest children in their work, the teacher himself must have a clear idea of at least the main facts of the subject.

Though there are many elementary English Text-Books on Botany, they deal with plants not generally known to the people of this country. I have, therefore, ventured to write tbis book in the belief that teachers in Elementary Schools will find their work easier and more interesting when they have a book in their own vernacular dealing with plants well-known to them.

As a close examination of familiar plants is about the best beginning for the study of Botany, only the most common plants are dealt with in this book. Practical work is, of course, indispensable and for the use of this book (except for internal structure) a few mounted needles, a lens of a low magnifying power and a knife will be enough. As the study of internal structure is fascinating and as it is very necessary to clearly understand the physiology of the plant, the teacher would do well to use a microscope for purposes of demonstration. A good microscope magnifying up to 400 diameters may be got from Messrs. R. J. Beck, or E. Leitz, London for about Rs. 80.

This is a close translation of the second edition of my Tamil book and the work of translation has been carried out admirably by M.R.Ry. S. Venkatasubbarama Sastri, Telugu Pandit, S. P. G. High School, Madras.

MADRAS,<br>1st *September* 1909.

K. RANGACHARI.

# పీఠిక.



మన హిందూదేశమున సకల భాషలలోను కావ్య పురాణేతిహాసాదులు రచియింపఁబడియున్నవి. ఇవియెల్లను నీతి, వేదాంత, ధర్మ శాస్త్రాదులను దెల్పుచున్నవి. మన దృష్టికిఁ బ్రత్యక్షమైయుండు వస్తువుల స్వభావమునుగూర్చి తెలుపు గ్రంథములు మనభాషలలో మెండుగా లేవు. అయితే, ఆంగ్లేయులు పదార్థస్వరూప పరిజ్ఞానమె (Natural science) చాల ముఖ్యముగ నెంచి, తద్విషయికములైన గ్రంథము లనేకములు రచియించియున్నారు. కావున వారు నవీన విషయములను గనిపెట్టి, తత్కాలమున నభివృద్ధి నొందుచున్నారు. మన చుట్టుపట్లఁ బ్రతిదినము చూచుచుండు వస్తువుల పరిజ్ఞానముగూడ మనకు లేదు. మన కా పరిజ్ఞానము గావలె నన్నయభిరుచియు లేదు. అట్లభిరుచిగలవారు కొందఱు స్వభాషలలో నట్టి గ్రంథములు లేనందునను, ఇతరదేశభాషలలో నట్టి గ్రంథము లున్నందునను, వారాభాషలఁ జదివి, వానియం దత్యంతాదరముఁ జూపుచున్నారు. మనదేశ భాషలు హీనదశకు వచ్చుట కిదియు నొక కారణము.

ఇట్టిలోపము వారింపవలెనన్న కుతూహలముగల హూణభాషయందారి తేఱినవారలు కొందఱు మన భాషలలో నున్న లోపమును, మనదేశక్షీణతను బోఁగొట్ట నెంచి, ప్రకృతిశాస్త్రపరిజ్ఞానంబు నాంగ్లేయ భాషరానివారికిఁ గలిగింపఁగోరి, యాంగ్లేయభాషలో నున్న వస్తువిజ్ఞాన శాస్త్రము (Physics), రసాయన శాస్త్రము (Chemistry), జీవశాస్త్రము (Biology), చరిత్రములు (Histories) మొదలగు గ్రంథములను స్వభాషలలో నిప్పుడిప్పుడు రచియించి యున్నారు.

అట్లు రచియింపఁబడిన గ్రంథములలో నిది యొకటి. ఈ యోషధిశాస్త్రమును గూర్చి యనేకు లాంగ్లేయ దేశీయులు పలుగ్రంథములను వ్రాసి యున్నారు. అయితే, అవి యెల్లను వారి దేశములో నున్న వృక్షముల నుదాహరణముగాఁ గైకొనుచున్నవి. అవి మనకు బోధపడుట యసాధ్యము. ఏందుకనఁగా నొక దేశమున నున్న చెట్లు మఱియొక్క దేశమున నుండవు. కావున గ్రంథకర్తగారు మన దేశమున నున్న చెట్లనే యుదాహరణముగాఁ గొని, యతిసులభముగా బోధయగునట్లు దీనిని ద్రావిడభాషయందు రచియించి పటములతోఁ గూడఁ జేర్చి ముద్రింపించిరి. ఇది శీఘ్రకాలములోపలనే ద్రావిడదేశమందు వ్యాపించి, యచ్చటి జనులయాదరము వడయుటచే దీనిని రెండవపర్యాయము ముద్రింపించ నారంభించి, యితర

భాషలలోఁగూడ రచియించుట సర్వ జనోపకారక మగునని యెంచి, నన్నుఁ దెనుఁగుభాషయందు భాషాంతరీకరణముఁ జేయ నియోగించిరి.

ఈ భాషాంతరీకరణము వారిచే ద్రావిడ భాషలో రచియింపఁబడిన యోషధిశాస్త్రము ననుసరించి చేయఁబడినది. దీనియం దచ్చటచ్చట వచ్చు సంకేతపదంబులు గూడినంత వఱకు నర్థవంతములైనవియె కూర్పఁబడినవి. అవి కొందఱి కభిమతములుగాను, మఱికొందఱి కనభిమతములుగాను నుండవచ్చును. అయినను, నూతన గ్రంథనిర్మాణమున నూతన సంకేతపదముల నిర్మించుట కష్టసాధ్యము గనుక, నట్టిపదములను వాడుకలోనికిఁ దేవలయునని కోరుచున్నాను.

ఓషధిశాస్త్రమునుగూర్చి యతి సులభముగా నీ గ్రంథము బోధించుచున్నదిగాన, ఎలిమెంటరీ పాఠశాలోపాధ్యాయులు తమ బాలుర కీ గ్రంథము నుపయోగపఱచి, యిట్టి గ్రంథములను దేశభాషలలో రచియింపఁ బ్రోత్సాహముఁ గలిగింతురని కోరుచున్నాను.

ఇట్లు,

వేపేరి. 1909. } యస్. వేంకట సుబ్బరామశాస్త్రి.

# విషయసూచిక.



అధ్యాయము. | పుట.


| అధ్యాయము. | | పుట. |
|---|---|---|
| 1. | ప్రాణముగలవాని యొక్క గుణములు, భేదములు (Living things, their nature and kinds) ... | 1 |
| 2. | చెట్లయొక్క నిర్మాణము, అంగములు (The parts of a Plant body) ... ... ... | 10 |
| 3. | వేరు (The Root) ... ... ... | 18 |
| 4. | ప్రకాండము (The Shoot) ... ... ... | 34 |
| 5. | మొగ్గయు, ఆకును (Buds and Leaves) ... | 52 |
| 6. | పుష్పములు, వాని యంగములు, వాని పర్యాయములు (The parts of Flowers and Inflorescence) | 80 |
| 7. | పుష్పముల యొక్క పొందికయు, వాని వ్యాపారమును (The structure and function of Flowers) | 103 |
| 8. | మకరంద రజస్స్పర్శము, గర్భధారణము (Pollination and Impregnation) ... ... | 120 |
| 9. | ఫలము, విత్తనము (Fruits and Seeds) ... | 135 |
| 10. | విత్తనము మొలచుటయు, మొలక పెరుగు క్రమమును (Germination of Seeds and Seedlings) | 171 |
| 11. | చెట్లయొక్క జాతివిభాగ క్రమము (Classification of Plants) ... ... ... | 187 |

అధ్యాయము. పుట.

12. చెట్లకుటుంబవిభాగములు, వానిలక్షణములు (Description of some of the common families of Flowering Plants) ... ... 205

13. చెట్ల యొక్క లోపలి నిర్మాణము (Internal structure of Plants) ... ... ... 280

14. చెట్లయొక్క కార్యములు (Physiology of Plants) 320

పరిభాషాపదముల వివరణము (Glossary) .. 361

# ఓషధి శాస్త్రము.

## 1 - వ అధ్యాయము.

### ప్రాణముగల వానియొక్క గుణములును, భేదములును.

ఈ లోకమందుఁగల సకల పదార్థములను చేతనములు, అచేతనములు అని యిరు తెగలుగా విభజించుట వాడుక. చేతనము లనఁగా ప్రాణము గలవి. అచేతనము లనఁగా ప్రాణములేనివి. ప్రాణు లివి యని, ప్రాణములేనివి యివి యని యందఱు సులభముగాఁ జెప్పఁగలిగినను, నీ రెంటికిని గల భేదము నెఱుఁగుట యసాధ్యము గనుక, నాభేదము నెఱుఁగుటకై కొంతమాత్ర మిచ్చటఁ జర్చ చేయుదము.

ఈఁగ, చీమ, దోమ, పశువు మొదలగునవి యెల్లను ప్రాణులని మనము తలంతుము. ఒక్కచోటనే యుండక సంచరించునవి యన్నియుఁ బ్రాణము గలవి యని మనము చెప్పుదుము. అనేక ప్రాణులొక్కచోటనె యుండక, నొకచోటినుండి మఱియొక చోటునకుఁ బోవ శక్తిగలవిగా నున్నను, ప్రాణులని చెప్పుటకీ సంచార శక్తియొక్కటె ప్రధానలక్షణమని తలంపఁగూడదు. ఏలయనఁగా, ఒకచోటనేయుండి పెరిగెడు ప్రాణు

లనేకములు గలవు. పగడపు తీఁగలను గలుగఁజేయు జంతువు లును, వాని వంటివియు నిట్టివియనవచ్చును. ఇవి సముద్రము లోపలనుండు ప్రాతిబండలపై వేళ్లు పాఱినట్లుగా నుండి విశేష ముగాఁ బెరుగుచున్నవి. చెట్లు, చేమ, పచ్చిక యివి యున్న చోటనేయుండి, సంచరించు శక్తి లేనివైనను, ప్రాణములేనివని తలంపరాదు. సంచార శక్తిలేని కారణముచేతనే వీనిని ప్రాణ ములేని వానినిగ నెంచుట సరియగునా?

ప్రాణము లేనివానికి సంచారశక్తి లేదు. ఎన్ని యేండ్ల కైనను నవి వేసిన చోటనే యుండుటయే కాక, స్వభావమునం దును, రూపమునందును స్వయముగా నేలాటి మార్పును నొంద దవు. ఒక కలకండ పెల్లనైనను, లేక యొక ప్రాతిగుండు నయిన నొక చోటనుంచి యుండిన యెడల నది స్వయముగా నెన్నాళ్ల కైనను మార్పుదల నొందక యొకేతీరున నుండును. తడియు, వేఁడిమియుఁ దగులకున్న, దాని రూపమునం దెట్టిమాఱుపాటును గలుగదు. తానుగా నాకారమందుఁ బెరుగదు. ప్రాణులన్ననో యెల్లప్పు డొక తీరుననే యుండక, మాటిమాటికి మాఱుపాటు నొందుచుండుటయె కాక, యాహారమును లోపలికిఁగొని, పెరు గుచు, రూపమునందుఁ బలుపు నొందుచు వచ్చును. నీటిలోఁ గరఁగియుండు కలకండను నెండలోఁబెట్టి, కొంతసేపుండిన యెడల, నా కలకండతోఁ జేరియున్న జలము కొంచెముకొంచెముగా నావి

రియై పైకిలేచి పోనుపోను, దానిలోఁ గలుగు సన్నకలకండతును కలొకప్పుడు రూపమునందుఁ బలుపు నొందును.

గడ్డలుగా నుండు వస్తువును, నీటియందుఁ గరఁగియుండు వస్తువును నేకరూపమగు పదార్థమగుటచే నీటియందుఁ గలిగెడి చిన్న చిన్న తునుకలు వెలుపట నన్నివైపుల నంటుకొనుచు వచ్చుటచేత నివి రూపమునందు పరివి నొందుచున్నవి.

జీవజంతువుల పెం పన్ననో యీలాగు వెలుపలితట్టున మీఁదుమీఁదుగా నదేవస్తువు చేరుచుండుటవలనఁ గలుగదు. వానియం దాహారపదార్థములు లోపలికిఁ జొచ్చి, లోపలనుండు వస్తువులతోఁ జేరుటచేత నభివృద్ధి గలుగుచున్నది. ఎట్లనఁగా, జంతువు లాహారపదార్థములను లోఁగొని, వానిని దేహములో నుండు నితర వస్తువులనుగ మార్చి, వానిని ముందుండు భాగంబు లోపలఁ జేర్చుకొని, వర్ధిల్లుచున్నవి. ఆహారపదార్థములును, దేహములోనుండు పదార్థములును నొకవిధమైనవి గావు. ప్రాణులయందభివృద్ధి గలుగుటకీ యాహార పదార్థములు మార్పుదలనొందవలయును. కాఁబట్టి ప్రాణు లాహారపదార్థమును లోఁగొనుటయె కాక, వానిని దమలోపలనుండు పదార్థములనుగ మార్చునట్టి శక్తినిగూడఁ బొందియున్నవి. మఱియుఁ బ్రాణులకు సంతానవృద్ధికరశక్తి (తమవంటివానిని గలిగించు శక్తి) గలదు. ప్రాణము లేనివానికా శక్తి లేదు.

ప్రాణము గలవానికిని, ప్రాణములేనివానికిని గలభేదము నిట్లు సంగ్రహంబుగాఁ జెప్పవచ్చును. ప్రాణు లాహారమును గ్రహించును. స్వరూపమునందు మార్పు నొందుచుండును. సంతానవృద్ధిని జేయును. ప్రాణములేని వాహారమును లోఁగొనవు. స్వరూపమునందు మార్పుదల నొందవు. వానికి సంతాన వృద్ధికరమగు శక్తి లేదు.

చెట్టు, చేమ, తృణములనెడి యోషధులు సంచరింపక యొకచోటనే యున్నను, నవి యాహారమును లోపలికిఁ గొని, యాహార పదార్థములను దమకుఁ గావలసిన పదార్థములనుగా మార్చి పెంపొందుశక్తినేకాక సంతానవృద్ధికర శక్తిని గూడఁ బొందియున్నవి. కావున నోషధులనుగూడ మనము ప్రాణము గలవానిఁగానే తలంప వలయును. అయితే వానికి సంచారశక్తి లేదుగనుక, వానిని స్థావరవర్గములోని వానినిగాఁ జెప్పుటవాడుక.

తఱుచుగా నొకమృగమునకును, చెట్టునకును గల యవయవ నిర్మాణములో భేదము లుండుటచే, వీనినిరెంటిని బరస్పర భిన్నములను గానే తలంచుట వాడుక. ఆహారమును లోఁగొనుటయందును, వాని నుపయోగపఱచుకొను పద్ధతియందును నీరెంటికిని వ్యత్యాసము గలదు. భూమి మీఁదను, నీళ్లలోపలను నదృశ్యములైన మిక్కిలిసూక్ష్మములగు జంతువులును, చెట్లు నునున్నవి. వీనిని లెస్సగాఁ బరీక్షించిన నీరెంటికిని భేద ముండు

నక్లై యగపడదు. ఇవి మెల్లను ప్రాణులని చెప్పవలయునే కాని, ప్రాణు లివి, వృక్షము లివి యని విభాగించుట సరికా దని తోంచుచున్నది.

ఆంగ్లేయులును, ఐరోపాఖండములోని తక్కిన దేశముల వారును, ఓషధులయొక్కయు జీవజంతువులయొక్కయు నుత్ప త్తి, స్వభావము మొదలగు వానిని బాగుగాం బరిశోధనచేసి, యీ విషయములనుగూర్చి యొక్క శాస్త్రము రచించి, దానికి "జీవశాస్త్రము" మని పేరిడియున్నారు. ఈ జీవశాస్త్రము ప్రాణులయొక్క యుత్పత్తి, వ్యాపారము, జననప్రభృతి మ రణపర్యంతమయిన గతి, జాతి, తెగ, లోతెగ మొదలగు వా నినిగూర్చిన విషయంబులను జక్కఁగాం బోధించుచున్నది.

ఈ శాస్త్రములోని భాగము లేవనఁగా:—అంగవి భాగము, వానివ్యాపారము, జననాది మరణ పర్యంత గతి, జాతి, తెగ, లోతెగ మొదలగునవి. వీనిని దెల్పుశాస్త్రము జీవశాస్త్ర మనఁబడును.

జీవశాస్త్ర విచక్షణులు జంతువులు, ఓషధులు మున్న గువానిని జక్కఁగాం బరిశోధించి, ప్రాణముగలవి మెల్లను బెరిగి వర్ధిల్లుటకు మూలవస్తు వొక్కటియె యని సిద్ధాంతము చేసియున్నారు. వారా మూలవస్తువునకు "ప్రొటోప్లాసమ్" (Protoplasm) అని పేరు పెట్టియున్నారు. ఆ వస్తువే ప్రాణుల

లోపలఁజేరియుండి యన్నిమార్పాట్లను గలుగఁజేయుచున్నది. అది నశించినయెడల, నేకార్యము నడువదు. ప్రాణుల కీ వస్తువే యాధారము గనుక, దీనిని మనము "జీవాణువు లేక ప్రోటొప్లాసము" అని చెప్పవచ్చును. జీవాణువు లేని యొక చెట్టయినను, జీవజంతువయినను లేదు. ఎంతసూక్ష్మవస్తువునందయినను జీవాణువున్నయెడల, నచ్చటఁ బ్రాణ ముండును. అది నశించిన యెడలఁ బ్రాణ ముండదు.

చెట్లు, చేమ, తృణము లనెడి యోషధులును జీవజంతువులును బ్రాణముగలవిగా నున్నప్పటికిని నీ రెండనేకవిషయములలోఁ బరస్పర భిన్నములై యున్నవి. మృగములు, పురుగు పుట్రలు మున్నగునవి తమ యాహార పదార్థములను దామే కలుగఁజేసికొనుటకు శక్తి లేనివిగా నున్నవి. ఇవి యితరప్రాణులనైనను, తృణములు, చిన్నచెట్లు మున్నగు వానినైనను, లేక, వీనియందుఁ బుట్టినవై సేకరింపఁబడియుండు పదార్థములనైనను భుజించుచున్నవి. చెట్లన్ననో జలము, లవణము, అంగారామ్లవాయువు (Carbon Dioxide) వీనిని గొని తమకుఁ గావలసిన యాహారమును దామే కలిగించుకొనుచున్నవి. భూమినుండియు, ఆకాశమునుండియు, జల, లవణ, అంగారామ్లవాయువులను లోపలికిఁ గొని, సూర్యకిరణముల సాహాయ్యముచే వానిని వేఱు రూపము నొందించి, వేఱొక విధముగాఁ జేర్చి, కడపటఁ దమ కాహార యోగ్యములయిన పదార్థములను గలిగించుకొనుచున్న

వి. ఈ శక్తి వీని కుంకుటకుఁ గారణ మాకులం దుండు పచ్చ రంగు. ఈ యాకులందలి పచ్చరంగునకుఁ గారణమగు పదార్థము ప్రాణులదేహములం దుండదు. దీనిని బట్టియె యవి తమకుఁ గావలసినయాహారయోగ్య పదార్థములను దాముగాఁ గలుగఁజేసికొనుటకు శక్తిలేనివై యున్నవి.

ఇచ్చట ముద్రింపఁబడియుండు పటమునందు నీటిలోఁ బెరుగునట్టి మిగుల సూక్ష్మములయిన నాలుగు జంతువులయొక్క రూపములు మిగుల గొప్పవిగాఁ జూపఁబడి యున్నవి. ఒక చిన్నచీమ యొక మనుష్యునంత గొప్పదిగా వ్రాయఁబడిన నది యెంత పెద్దదిగా నగపడునో యంత పెద్దవిగా నుండునట్లీ ప్రాణులు కనఁబఱుపఁబడి యున్నవి. వీనిలో మొదటిది జీవాణురేణువు. ఇది గుంట, కాలువ మొదలగువానియందలి నీటిలో నడుగునఁ జేరియుండు నడుసులో విశేషముగా నుండును. దాని నైరోపియనులు "అమీబా" (Amoeba) అని యందురు. దానికి సంచారశక్తి గలదు. అది యాహారమును లోఁగొనుచుండును. అది విభజనపడి, రెండు జంతువు లగును. ఇట్లది మాటిమాటికి విభజనపడుచుండుటచేత, ప్రాణులు మెండుగాఁబుట్టి, పెరుగుచున్నవి. ఇవి నీటియం దుండు నితర ప్రాణులనైనను, సూక్ష్మ సస్యములనైనను నాహారముగాఁ గొనుచున్నవి. పచ్చనిరంగు లేనివియగుటచేత నివి తమంతటఁ దామె తమ యాహారమును గలిగించుకొనఁజాలక యున్నవి.

కావున వీనిని సూక్ష్మజంతువులనియె [illegible]. 1-వ పటమునందుఁ జూపఁబడిన మొదటిదిదప్పఁ దక్కిన మూఁడింటి




1-వ పటము.—జలమునందు వసించు బహుసూక్ష్మములగు చెట్లును, ప్రాణులును. 1. జీవాణు వను సూక్ష్మప్రాణి. 2, 3. ఆకుపచ్చనగల చెట్లు. 4. ఆకు పచ్చన లేనిచెట్టు. 1, 2, 3 ను 600 రెట్లు పెద్దదిగాను, 4-వది 1200 రెట్లు పెద్దదిగాను గనఁబఱుపఁబడియున్నవి.

యందు జీవాణువు కణములం దణఁగియున్నది. ఈ కారణముచేత నివి మూఁడును సంచరింపఁ జాలవు. రెండవ, మూఁడవవానిలోని జీవాణువునం దాకు పచ్చరంగు నిండియుండుటవలన నవి యెంత సూక్ష్మవస్తువులైనను తమయాహారమును దామె కలిగించుకొనును. నాలవదానియందలి జీవాణువునం దాకుపచ్చరంగు లేదు కాఁబట్టి తన యాహార పదార్థములను దానే కలిగించుకోనేరదు.

ఓషధులను యంత్రములతోఁ బోల్చి చెప్పవచ్చును. అయినను, మనుష్యులచే నిర్మింపఁబడు యంత్రములమాడ్కి నివి సులభసాధ్యములు గావు. ఓషధు లనెడి యంత్రములు మిక్కిలి చిక్కగాను, వింతగాను నున్న యంత్రములుగాఁ దలంపవలయును. చెట్లయొక్క కార్యమేమనఁగా, సూర్యకిరణముల వెలుతురును లోఁగొని, యాహారపదార్థములను నిర్మించికొని, వానిని భుజించుచుఁ, దమ యంగములను వృద్ధినొందించుచు, లోకమునఁ దక్కిన కార్యములకుఁ గావలసిన శక్తి గలవై యనేక వస్తువులను మెండుగాఁ గలుగఁజేయుచుండుటయె.

ఎప్పుడును బనిచేయుచుండెడి యోషధులకుఁ దమ సంతతి వృద్ధిఁ గావించుకొనుటయె ముఖ్యకార్యము. చెట్లయందన్ని యంగములును దఱుచుగా నీ కార్యము నిమిత్తమె సృజింపఁబడియున్నవి. పుష్పములయొక్క రూపును, వన్నెయు, వాసనయు, మఱి కొన్ని యుపాయములును నిట్లు తమ సంతతి వృద్ధిచేసికొన నేర్పడిన సాధనములు. ఈ విషయములు పుష్పముయొక్క యంగములను, గర్భాధానమును గూర్చి చెప్పు నధ్యాయమందు వివరింపఁబడును గాన నచ్చటఁ జూచిన వీని సంగతి బాగుగాఁ దెలియును.

## 2 - వ అధ్యాయము.

### చెట్లయొక్క నిర్మాణమును, అంగములును.

చెట్లయొక్క నిర్మాణము, వృద్ధి, వృద్ధియగు రీతి వీనిని దెలిసికొనవలయుననిన, భూమియం దంతటఁ బెరుగు చెట్లనే గమనించిచూడవలయును. శ్రద్ధతోఁ బరిశోధనను జేయవలయును. లోకమునందు జంతువులవలెనె చెట్లును ననేకములుగానున్నను, సాధారణముగా మనచుట్టును నన్నివైపులఁ బెరుగుచుండుచెట్లన్నిటియొక్క యంగములును, నడతయు నొకరీతిగానేయుండునని చెప్పవచ్చును. కాఁబట్టి చెట్లయొక్క యుత్పత్తి, స్వభావము, అభివృద్ధియను వానిని సామాన్యమైన కొన్ని చెట్లయొక్క పరిశోధనమువలననే యెఱుంగవచ్చును. పొన్న, గంగరావి, అవిసె, వంగ, ఉమ్మెత్త, ప్రొద్దుతిరుగుడు, ఆముదపుచెట్టు, గుమ్మడి, జొన్న, కొబ్బరి, తాటి మొదలగు చెట్లలోఁ గొన్నిటినిఁ బరీక్షించి, కొన్ని విషయముల నెఱుఁగుట కారంభింతము.

మనకందఱికిని పొన్నచెట్టు తెలిసినదే కదా. ఇది యంతటఁ గాన్పించు నొక యందమగుచెట్టు. మనుష్యుల యభివృద్ధి బాల్యమునుండియారంభించునట్లు పొన్నచెట్టుయొక్కయు, తక్కినచెట్లయొక్కయు నభివృద్ధి మొలకలనుండి యారంభించును. అవి మొదట మొలకలు పిదప పిల్లలునై, దినక్రమేణ పెద్ద చెట్ల

గుచున్నవి. 2-వ పటమునందుఁ జూపఁబడినది పొన్న మొలక



యొక్క రూపము. ఇది మిక్కిలి చిన్నచెట్టుగా నున్నను, దీనికి వేరును, కొమ్మలును నున్నవి. వేరనునది నేలప్రక్కకుఁ జూడిక్కనిగిడించి, భూమి లోపలికిఁ జొచ్చి, యచ్చటఁ బూడియుండుభాగము. కొమ్మయనునది సూటిగాఁ బైకిఁ బోయి, గాలియు, వెలుతురును జక్కఁగా సోఁకునట్లు వెలుపటనే పెరుగుచుండు భాగము. ఈపటమునందీ రెండు భాగములకు నడుమఁ గుడివైపున నుంటగాఁ గాన్పించునది విత్తనము. ఇది భూమిలోపలనే యుండి నశించుచున్నదే కాని, బయటికి వచ్చుట లేదు.

2-వ పటము.—పొన్న మొక్క.

ఈ పొన్న మొక్కయం దొక కొమ్మయే యున్నది. దినముల పేరిట నది పెరిగి పొదనగుటయే కాక, దానియందింక ననేకశాఖలు పుట్టునుగదా? ఎన్నికొమ్మలు పుట్టినను, వానియంగము లొకపోలికగానే యుండును. మొక్కకొమ్మయొక్కయు, చెట్టుకొమ్మయొ

క్కయు నవయవములేవి యనిన, ఆకులును, ఆకులను సహించు చుండు నడిమిదంటును. కొన్ని ఋతువులలో నీ రెంటిలోఁ గూడ మఱికొన్ని యంగములు అనఁగాఁ బువ్వులు, కాయలు నుండును. పొన్నచెట్టుయొక్క భాగములు క్రిందిబోదెయు, దానిలోఁ గూడి నలుప్రక్కల లావుగాఁ బెరుగుచుండు కొమ్మలును. వీటి కన్నింటికిని జేర్చి "ప్రకాండ" మని పేరు పెట్టవచ్చును. పొన్న మొక్కయందు విత్తనమునకు మీఁదుగానుండు భాగము యావత్తును బ్రకాండము. భూమికిఁ బైనఁ బెరుగుచుండు చెట్ల యవయవముల సముదాయమున కెల్ల ప్రకాండ మని పేరు. టెంకాయ, తాటి, పోక, ఈఁతచెట్లయందుఁ బ్రకాండము శాఖలుగా విభజన పొందుట లేదు. మఱ్ఱి, చింత, పొన్న, అవిసె మొదలగు చెట్ల యందుఁ బ్రకాండ మనేక శాఖలు గలిగి యుండును.

2-వ పటమునందుఁ గనఁబఱుపఁబడియుండు పొన్నమొక్క యందలి ప్రకాండమున కొకటె రెమ్మ గలదు. వేరు పలుశాలను బొందియున్నది. పొన్నమొక్క మిక్కిలి చిన్నదిగనుండు నపుడె మొదటివేరునుండి యనేక శాఖలు కలుగుచున్నవి. సాధారణముగా మొదటివేరును, దానిశాఖలును వెలుతురు కోరక భూమిలోనికి దిగుచున్నవి.

పొన్నచెట్టు కొమ్మలందును, నితర వృక్షముల కొమ్మలదును నాకులు మెండుగాఁ గలుగుచున్నవి. ఈ యాకులన్నియ

గొమ్మలందుఁ బలువిధములుగాఁ బలుతావులందుఁ జేరియున్న
వి. ఆకులు దంటుతోఁ గలిసియుండు తావు "గణుపు" అనఁబ
డును. రెండు గణుపుల మధ్యమున నుండు దంటుయొక్క భాగ
మునకు "గణుపుమధ్యభాగము" అని పేరు పెట్టవచ్చును. ఒకొ్క-
క్క గణుపునందును నాకులు చేరి యున్నందున నాకులకును దం
టునకును నడుమ నొక కోణము (మూల) ఏర్పడుచున్నది. ఈ
కోణమునకు "గణుపుసందు" అని పేరు పెట్టవచ్చును. పొన్న కొ
మ్మలలో నొకొ్కక్క గణుపునందును రెండేసి యాకులుంటు
న్నవి. ఇవి క్రిందికి మీఁదికిఁగాక, సమముగా నొకదానికొకటి
యెదురెదురుగానున్నవి. అయితే, ఒక కొమ్మయందొకగణుపు
న నున్నట్టి యాకుల జత లే దిక్కును జూపుచున్నవో, దానికిఁ
బై గణుపు, క్రిందిగణుపు వీనియందలి యాకుల జత ల దేదిక్కు-
ను జూపుచుండవు. పొన్న కొమ్మల గణుపులందలి యాకులజత
లొకదాని కొకటి యడ్డముగా నుండుట వాడుక. ఇట్లొక జతకు
మఱొక జత యడ్డముగా నుండుటవలన నొకదాని కొకటి
మఱుఁగు గానేరదు. అట్లుండుటచే సూర్యరశ్మి యన్ని యాకుల
లోను దగులుచున్నది.

అన్ని చెట్లలోను, కొమ్మల కొనలయందును, గణుపు
సందులందును మొగ్గ లుంటూనే యుండును. ఇవి బహుసూక్ష్మ
ములగుటఁ బట్టి నిదానించి చూచిననే కాని యగపడవు. అవి

కొమ్మ కొనలందును, గణుపుసందులందును బుట్టుచుండునుగాని తక్కిన తావులందుఁ బుట్టవు. కొనమొగ్గలు పెరుగుటవలనను కొమ్మలు నిడివి వగుచున్నవి. గణుపు సందులందలి మొగ్గలు పెరిగి క్రొత్త కొమ్మలగుచున్నవి. ఒక కొమ్మయందా కొమ్మ నిడుపాటి దగునట్లు చేయుకొనమొగ్గ పెరుగుచుండు నంతవఱకును దక్కినగణుపు మొగ్గలు దలయెత్తవు. కొనమొగ్గ లేశా ణముచేతనైనను నశించినయెడల,పిదప గణుపుమొగ్గలు పెరుగ నారంభించి, కొమ్మలగుచున్నవి. 2-వ పటమున నుండు పొన్న మొక్కయొక్క ప్రకాండాగ్రమునందలి మొగ్గ సూది మొన వలె బహు సూక్ష్మముగాఁ గనఁబడుచున్నది. గణుపుసందుల మొగ్గ లడఁగి మఱఁగియుంటున్నవి.

పొన్నకొమ్మలను వలెనె గంగరావి కొమ్మలనుగూడ బరిశోధించి చూతము. 3-వ పటమునం దొక గంగరావి కొమ్మ యొక్క రూపము గానఁబడుచున్నది. ఈ కొమ్మయం దొక్కొక గణుపున, కొక్కొక యాకే యున్నది. ఈ గంగరావి యాకు తొడిమ పొన్నాకు తొడిమకంటె నిడివిగా నుండును. మఱియు పొన్నకొమ్మలలో నాకులు దంటుచుట్టును నాలుగు వరుసలుగా నుండును. అనఁగా నొక కొమ్మయందొక గణుపునందుండు నాకుల జత, దానికి మీఁదను క్రిందను నొక జత విడిచి రెండవ జత సూటి గానొక దిక్కునే చూపుచుండుటవలనను, ఇవి

ధమునసే, అదే గణుపునందలి యాకుల జతకు మీఁదను గ్రిం



3-వ పటము.—గంగరావికొమ్మ.

దను నుండు గణుపులందలి యాకులజతలు తప్పించి సూటిగా
నుండి మఱియొక దిక్కు చూపుచుండుటవలనను నాకులు దంటు
చుట్టును నాలుగు వరుసలుగా నేర్పడియున్నవి. గంగరావి కొ
మ్మలం దాకులు దంటుచుట్టును నొక్క గణుపున కొక్కటొ
క్కటి యుండుటవలన నవి వరుసలు వరుసలుగాఁ గాన్పింపవు.
ఒక గణుపునందలి యొక యాకునకు మీఁదను గ్రిందను నుండు
గణుపులందలి యాకులను లెక్కపెట్టి చూచిన నా యాకునకు

నాలవ గణుపునందలి యాకు సూటిగా నుండును. ఈ చెట్టు నందును నాకులు గణుపుసందులనుండియె పుట్టుచుండును. ఈ విషయము పై పటము చూచినఁ దెలిసికొనవచ్చును. ఇదియకాక, కొనమొగ్గ పటమునందు బాగుగఁ గనఁబడుచున్నది గదా. గణుపులలోఁ దొడిమల కడుగున నిరుప్రక్కలందును రెండు సన్నని సూక్ష్మపుచ్ఛము లున్నవి. వీనికి "గణుపు పుచ్ఛములు" అని పేరు పెట్టవచ్చును. ఇవి తెలుపుగా లేఁతకొమ్మలందు మాత్ర ముండును. దంటులు ముదిరిన నాగణుపుపుచ్ఛములు రాలిపోవుచున్నవి.

ఉమ్మెత్త, గుమ్మడి, వంగ మొదలగు చెట్లయొక్క ప్రకాండములు గొమ్మలుగాఁ జీలుచున్నవి. ఆకులు దంటుచుట్టును నిడుపాటి తొడిమలతోఁగూడి, యొకగణుపున కొకటివంతున వృద్ధినొందుచున్నవి.

పైఁజెప్పినచెట్లన్నిటియందును గణుపుసందులనుండి యాకులు మాత్రము పుట్టి పెరుగుటయె కాక, కొన్నిసమయములందు బూవులును, గాయలును బుట్టి పెరుగుచుండును. పొన్నయొక్క కొమ్మ యొకటి యెండ దగులుటకై వెలుపలికివచ్చి, పైకిలేచి పెరుగుచుండునట్లె, యాచెట్టునందలి తక్కిన కొమ్మలు మఱియు పలుతెగల ప్రాఁకులు, చెట్లు మొదలగువాని యొక్క కొమ్మల

ను నాలాగున నే నలు ప్రక్కల వ్యాపించి పెరుగుచున్నవి. వెలుగు లలో నీడగల్గియుండు స్థలములందుఁ బెరుగునట్టి చెట్లు చీఁకటిగల ప్రదేశములను వదలి వెలుతురు తగులునట్టి వెలిపార్శ్వమునందే పెరుగుచుఁ జిగిరించి పూచుచుండుటను మనము ప్రతిదినము చూడవచ్చును. ప్రాఁకుడులు దట్టముగానుండు తోఁపులయందు ప్రాఁకుడులమీఁద నల్లునట్టి తీఁగెలు క్రిందిభాగమందుఁ జిగిరించి యల్లుకొనక పైకెగఁబ్రాఁకి ప్రాఁకుడుయొక్క కొట్టకొన కొమ్మను సమీపించి యచ్చట మిక్కుటముగాఁ బ్రాఁకి యల్లుచున్నవి. మనయిండ్లయందును, తోఁటలయందును, పందిళ్ల మీఁదను పెరుగునట్టి కాఁకర, పొట్ల, చిక్కుడు మొదలగు తీఁగెలు ప్రాఁకుటను గమనించి చూచిన మొదల నివియును బ్రాఁకా నెముకొంటకు చక్కఁగా నెండ తగులునట్టి పైభాగమందే యధికముగా నల్లుకొని చిగిరించుటను మనము చక్కఁగాఁ దెలిసికొనవచ్చును. పందిటికి క్రిందిభాగమందును, చీఁకటిగలభాగములందును గొమ్మలును ఆకులును మెండుగాఁ గలుగవు.

ఓషధులలో నొక్కొక్క దానియందును రెండు భాగములు కలవు. అవి ప్రకాండము, వేరును. మొలకలన్నిటిలోను ప్రకాండము ఒక్క రెమ్మగానే యుండును. పెరుగను బెరుగను గొన్ని చెట్లయం దాయొకకొమ్మయె పలు రెమ్మలగును. కొన్నిటియందుఁ బ్రకాండము ఎల్లప్పుడును నొక్క

కొమ్మగా నుండుట స్వాభావికమె. పోక, కొబ్బరి, తాటి మొదలయినవి యీ తెగలోఁ జేరినవి యని ముందే చెప్పఁబడి యున్నది.

ప్రకాండముయొక్క కొమ్మలభాగము లేవన-ఆకు, రెమ్మ, పువ్వు, కాయ, మొగ్గలు మొదలయినవి. కొమ్మలు మొక్క లేఁతగా నున్నప్పుడు మొగ్గలరూపమున గలువుల వలెఁ గానుండును. ఆకులు కొమ్మచుట్టును గలువులయి, లేక కటిగానయినను, జతగానయినను, లేక నానికట్టఁబడిన విధము నను జేరియుండును.

## 3-వ అధ్యాయము.

### వేరు.

చెట్లలో భూమిపైకిరాక లోపలికి దిగి శాఖలై పెరుగు భాగంబులు వేళ్ళయొక్క సమూహమని తెలిసికొంటిమి. ప్రకాండమునందు రెమ్మ లుండునట్లె వేళ్ళయందును రెమ్మ లున్నవి. అయితే వేళ్ళరెమ్మలయందు ఆకులు, మొగ్గలు గలుగవు. ఇవి ప్రకాండమునందు మాత్రమే యుండును. ఒకచెట్టులో భూమిలోఁజొచ్చియుండు భాగమునందు ఆకులయినను మొగ్గలయినను నుండినయెడల వానిని వేళ్ళని చెప్పఁగూడదు. ఏలయనఁగా, వేరులయందు మొగ్గ లుండనే యుండవు. ఇవి యున్నట్లు

ప్రకాండము యొక్క కొమ్మలకు మాత్రమే. భూమిలోఁజొచ్చి వర్ధిల్లుట మాత్రమే వేరుయొక్క ముఖ్యగుణము కాదు. ఆకులును మొగ్గలును లేక శాఖలు మాత్రము ఉండుట వేళ్లకు ముఖ్యగుణమని తలంపవలయును. భూమిలోపలికిఁ జొచ్చి పెరిగినను లేక వెలిభాగమునందుఁ బెరిగినను వేళ్లకు మొగ్గలును ఆకులును ఉండవు. కొమ్మలు మాత్రమె వేళ్లనుండి కలుగును.

సాధారణముగ వేళ్లు భూమియందు నలుప్రక్కల వ్యాపించి పెరుగుటవలనఁ జెట్లు క్రిందపడక నిట్టముగా నిలుచుచున్నవి. మఱియు భూమియందుఁ గల జలమును పానముచేసి దానిని చెట్టుయొక్క పైభాగంబునకు వ్యాపింపఁ జేయుట వేళ్లయొక్క వ్యాపారము. ఏదైన నొక మొలకను వేరుతోఁ బెఱికి కొంత సేపుంచియున్న యెడల నది వాడి సోలిపోవుచున్నది. ఈలాగు వాడి పోయిన మొలకయొక్క వేరును నీళ్ళయం దుంచినట్టయిన కొంతకాలమునకుఁ బిదప నది వాడుదల వదలి ముందున్న స్థితినిఁ బొందఁగలదు. ఈ పరిశోధనవలన మనము తెలిసికొనఁ దగిన విషయమేమన:— మొలకను భూమియందుండి పెఱికిన పిమ్మట సూర్యరశ్మియును, గాలియును దానిలోనుండు నీటిని నావిరిగా మార్చి వెలిపఱచుచున్నవి. చెట్టు వాడి సోలి పోవుటకుఁ గారణ మిదియే. నీళ్లయందు వేరు నుంచిన, తరువాతను

ముందటివలెనే నీరు ఆవిరియై వెలువడుచుండును. [illegible] నీరు
వేరుమూలంబుగ చెట్టులో వెంటవెంటనే [illegible].
కావుననే వాడుదలలేక చెట్టు బిట్టుగా నున్నది. [illegible]
వేళ్లు భూమియం దుండు జలమును పీల్చుకొని [illegible]
జలంబు బోదెమూలముగ కొమ్మలకును ఆకులకును వ్యాపిం
చుచున్నది.

ముందు ముద్రింపఁబడియుండు ప్రత్తి మొలక యొక్క
పటంబును జూచినయెడల దాని వేరు క్రిందుగా [illegible]
వచ్చును. (2-వ పటమును జూడుఁడు.) దీనికిం బ చిన్న [illegible]
మొలకలలోను, విత్తు ప్రక్కనుండియును వేరు క్రి[illegible]కే
పాఱుచుండును. ఈలాగున క్రిందివైపునకు వ్యాపించుట [illegible]
ము చెట్లకు మిగుల నావశ్యకము. పలయనఁగా మొలకల యొక్క
వేళ్లు క్రిందిభాగమందు పాఱనిపక్షంబున భూమియం దుండు జల
మును పీల్చుకొనుటకు వానికి సాధ్యముకాదు. మఱియును నవి
చక్కఁగా పాఱినపక్షమున ప్రక్కన నుండు వేరుశాఖలు [illegible]
నలువైపుల పాఱుచుండును. అప్పుడు చెట్టు దృఢముగా నిల్చి
బాగుగా పెరుగును.

పెద్దమ్రాఁకులయొక్క వేరు చక్కఁగా క్రింది భాగమునఁ బది
లేక పదునైదు గజములనిడిపియును, పార్శ్వములందు ఏఁబది,
అఱువది, లేక నూఱుగజముల దూరము వ్యాపించియుండుట
స్వాభావికమే. దీనికి దృష్టాంతముగ మఱ్ఱి, చింత మ్రాఁకులన్నిటను

జెప్పవచ్చును. ఈచెట్లయందు కొమ్మలును ఆకులును అధికముగా నుండుటవలన వీనినుండి ఆవిరియై పోవుజలమును మిక్కిలి యధికముగా నుండును. కాబట్టి మీఁదుమీఁదుగా జలము భూమిలోనుండి వేళ్లమూలమున వృక్షమునఁ జొచ్చి పాఱుచుండనియెడల వృక్షజీవనమునకు వలసినజలము దొరకుట దుర్లభము. ఆకులు మొదలగువానినుండి నీరు ఆవిరిరూపమున వెలువడునప్పుడు భూమిలోనుండి జలము సమృద్ధిగా వృక్షములోఁ జొచ్చి పాఱుచుండనియెడల వృక్షజీవనమునకు జలము చాలక నానాఁటి నది యెండిపోవును. ఇట్టి జలలోపము చెట్లకు సంభవింపకయుండుటకే వేళ్లు నలుదిక్కుల వ్యాపించి జలమున్న ప్రక్కకుఁ బోవుచుండును. జలము భూమియం దొక్కస్థలమందే నిలిచియుండుట లేనందునను, భూమియొక్క పైభాగమందు తక్కువగా నుండుటవలనను వేరు తడిని వెదకుకొనుచు వ్యాపించుచుండును. వేళ్లీవిధమున భూమిలోపలఁ జొచ్చి నానాముఖముల వ్యాపించుటవలననే చెట్లు భూమిమీఁద దృఢముగా నిలువఁగలిగియున్నవి.

వేళ్లులోపల నేవిధముగాఁ బాఱుచున్నదని తెలిసికొనుటకు వేళ్లయొక్క కొనలను మనము చక్కఁగాఁ బరీక్షింపవలయును. క్రొత్తవేళ్లకొనలు చిన్నవిగాను కొంచెముగట్టివిగాను నుండును. వేళ్లకొనలు కొంతవరకు మూలరక్షణము అను నొకదా

రచే మూయఁబడియుండును. వేరుయొక్క కొన, మూలరక్షణము ఈ రెండును సూక్ష్మకణములచే నమర్పఁబడి యున్నవి. సాధారణముగా ఈవిషయము కన్నులకుఁ గనఁబడదు. ఈ భాగములను ఏఁబది లేక నూఱింతలు పెద్దవిగాఁ గనఁబడునట్లు చేసినట్లయిన వానిలోపలి నిర్మాణము మనకుఁ జక్కఁగాఁ దెలియును. ఇట్లు గొప్పవిగాఁ దెలియఁజేయుటకు నొకయంత్రమును గనుఁగొని యున్నారు. దీనిపేరు సూక్ష్మదర్శిని. కొందఱు ఈయంత్రమును భూతాద్దమని యందురు.




4-వ పటము—వేరును దానియాకృతియు 1. ఆవ మొలక. దీనియందు వేరువెంట్రుకలు బాగుగ కనబడుచున్నవి. 2. వేరుకొనయు మూలరక్షణమను ఒరయు.

సూక్ష్మదర్శినియందు అద్దము నుండి వేళ్లకొనలను జూచునప్పుడు, అవి యెంత పరిమాణము గలవిగ కనుపడునో అంతియ పరిమాణముగ నొక వేరుయొక్క కొన 4-వ పటమునందు కనఁబఱపఁబడి యున్నది. వేళ్ల కొనలలో మూల రక్షణము లేని భాగములయందు మిక్కిలి మృదువులై తెల్లగా నుండు వేరువెంట్రుకలు మెండుగాఁ గనఁబడును. 4-వ పటమునందుఁ గనఁబడు ఆవ మొలకయందీ వేరువెంట్రుకలు చక్కఁగాఁ గనఁబడుచున్నవి. వేరునందు మూలరక్షణముగల

భాగమును, రెండవవేరు వెంట్రుకలును 4, 5-వ పటములందు ప్రత్యేకముగాఁ గనఁబఱచఁబడియున్నవి. వేరువెంట్రుకలు మిగుల



5-వ పటము.—రెండవ వేరు వెంట్రుకలు.

మృదువు లయినవి. అయినను ఇవి చెట్టువృద్ధికి మిక్కిలియావశ్యకములైనవి. ఈవేరువెంట్రుకలు భూమిలో నుండుజలమును పీల్చుకొనుచున్నవి. మంటిలో నుండుటవలన నీవేరువెంట్రుకలను చుట్టును మంటియణువు లంటుకొనియుండును. ఈమంటియణువులు మిక్కిలి పలుచనైన నీటిపొరచే చుట్టఁబడియుండును. భూమిలోపల స్థిరముగా నిలిచియుండునట్టి యీవేరు వెంట్రుకలలోనికిఁ బీల్చుకొను వేరులమూలముగా పైకెక్కి కాండములోనికిఁ బ్రవేశించుచున్నది. ఈవిధముగా నొక్కొక్క వేరువెంట్రుకయొక్క చుట్టుములోఁగాఁ బోవునట్టి జలము మిక్కిలి స్వల్పముగానున్నను, అనేకములగు వేరువెంట్రుకలుండుటచే వృక్షమునకు జలము సమృద్ధిగా దొరకుచున్నది.

చెమ్మగల స్థలములలోఁ బెరుగు చిన్నకొనవేళ్లందు మాత్రమే యీవేరువెంట్రుకలు గలుగుచున్నవి. చెమ్మ లేనపోయిన యెడల నివి నశించును. ఇట్లు నశించిన యొక్కొక్క వేరువెంట్రుకకు మాఱుగా నింకి వేరువెంట్రుకలు క్రొత్తగాఁ బుట్టుచున్నవి.

మిగుల గట్టిగా నుండనియిసుక భూములయందుఁ బెరుగునట్టి పచ్చి కనయినను లేక యితరచెట్లనయినను వేళ్లు తెగకుండ పెల్లగించి చూచినయెడల వేళ్లకొనలయందు మంటియణువులు మెండుగా నంటుకొని యుండుట తెలియవచ్చును. (6-వ పటమును జూడుఁడు) ఈవేరును నీటియందుంచి మంటియణువులు కరిగినపిమ్మటఁ జూచినపక్షమున వేరునందలి కొన్ని వెండ్రుకలు కనఁబడును.



6-వ పటము.— ఆవ మొక్క వేరు వెండ్రుకలయందు మంటియణువులు అంటుకొని యుండుటను చూడుడు.

చెట్లకుఁ గావలసిన యాహారపదార్థములు భూమియందు నీటిలోఁ గరిగి యుండుటచేతఁ బెరుగునట్టి క్రొత్తవేరులను తేమగల తావులనె వెదకుచుఁ బోయి యచ్చట వేరువెండ్రుకలతో వ్యాపించుచుండుట స్వభావసిద్ధమై యున్నది. సాధారణమైన వేళ్లు చేయునట్టిపనులు రెండు. వృక్షములను క్రిందబడనియ్యక యాదుకొని వానిని దృఢముగా నిల్పుట, భూమియందుండు నీటిని బీల్చుట.

విత్తు మొలచునపుడు వేళ్లు సూటిగా భూమిలోనికిఁ బోవుచున్నవి. మొలకెత్తునపుడు ఒక్కొక్క మొలకకు వేరు ఒక్కొక్కటియే యుండును. ద్వ్యంకురదళబీజవృక్షములయందు మొట్ట

<u>సాధారణవేరు, అంటువేరు</u> అని వేళ్లు రెండువిధములు.



8-వ పటము.—నారవేరులు.



9-వ పటము.— ముల్లంగి.

తల్లివేరునుండి పుట్టునది సాధారణవేరు; ప్రకాండమునుండి పుట్టునది అంటువేరు.

కొన్ని చెట్లయొక్క వేళ్లు ముదిరి గడ్డలగుచున్నవి. ఇందులకు దృష్టాంతముగ ముల్లంగి, గెనసు, సాలామిశ్రి యనువానిగడ్డలం



10-వ పటము.—గెనసుతీగయును, రెండుగెనసు గడ్డలును.

జెప్పవచ్చును. ముల్లంగిచెట్టులో నెట్టొకటిక గడ్డ యొక్కటే యుండును. దీనిప్రకాండము మిక్కిలి చిన్నదై యుండును. ఆకులు గడ్డయొక్క శిరస్సునందుండును. ముల్లంగిచెట్టుయొక్క తల్లివేరు లేతదిగానున్నప్పుడు చిన్నదైనను, చెట్టులోనుండు నాకులు పెరుగను పెరుగను, ఇదియును క్రమక్రమముగా పెరుగుచు గడ్డయై ముదురును.

గెనుసుచెట్టునందును వేరులే గడ్డలగుచున్నవి. [illegible] కొమ్మలు భూమిమీఁద నల్లుకొనిపాఱఁగా గణుపులయందు అంటువేరులు పుట్టి భూమిలోనికిఁ జొచ్చుకొనును. వీనిలోఁ గొన్ని గడ్డలుగా పెరుగుచున్నవి. [illegible] గెనుసుతీఁగ నుండి గడ్డలు [illegible] గలుగుచున్నవి. ఈ గెనుసుగడ్డలన్నియు నంటువేరులే గాని తల్లివేళ్లు గానేరవు.



11-వ పటము.— అంటుచెట్టు.

ముల్లంగి, గెనుసు, వీనివలె నుండు కొన్ని చెట్లయందు వేళ్లు మిగుల గడ్డలగుటకుఁ గారణమేమి? వీనియందుఁ బ్రకాండము మిక్కిలి కుఱుచగా నున్నను, ఆకులు అధికముగాఁ బెరుగుటచేత ఆహారమునకుఁ గావలసిన పదార్థములు మెండుగా నుత్పత్తియగును. తమజీవనమునకుఁ గావలసినది పోను మి

పూర్వము నిలువచేసికొనిన యాహారపదార్థమును తల్లివేరు నుండి పీల్చుకొనునుగాన దానిగడ్డలు చిన్నవియగుచున్నవి.



13-వ పటము.— మఱ్ఱిఊడలు.

భూమిలోఁ జొచ్చి పెరుగుచుండుట వేళ్లకు స్వాభావిక మైనను కొన్ని వేళ్లు భూమిలోఁ జొరక యెల్లప్పుడు వెలుపల నయినను, లేక కొంతకాలము వెలుపలను గొంతకాలము భూమిలోపలనయినను బెరుగుటయుఁ గలదు. మాఁకులకొమ్మ లను పెనఁచుకొని పెరుగునట్టి పెక్కు చెట్లకు వేళ్లు భూమిలోఁ జొరఁబడక గాలియును, వెలుతురును సోఁకునట్లు భూమికి వెలిపా ర్శ్వమునందె పెరుగుచున్నవి. ఈవేళ్లు గాలియం దావిరిరూప మున సంచరించుజలమును గ్రహింపఁగలవు. 11, 12-వ పటము

K Rangachari
Botany



గుమ్మడి, సొరపలె నల్లునట్టి తీఁగలు పైకిలేవక భూమి నొక్క పై భాగమందైనను, ఇండ్లు, పందిళ్లు మొదలగు నున్నత ప్రదేశములందైనను నల్లుకొని పెరుగుచుండును. ప్రకాండ మెవి[illegible]ముగాఁ బెరిగినను దానికొమ్మలచేవహింపఁబడెడియాకులు గాలియు, ఎండయు సోఁకునట్లు భూమిమీఁదనే పెరుగుచున్నవి.

చెట్లలో ప్రకాండ భాగమయిన దంటులకు ఆకులు, పువ్వులు, కాయలు, చిగుళ్లు వీనిందగినట్లు వహించుటయె ముఖ్యధర్మము. ఉమ్మెత్త, ఆముదము, వంగవంటి చెట్లయం దాకులు, పూవులు, కాయలు మొదలగునవి మిక్కుటముగా నేక కాలము నుండవు. వీనిలో దంటు భరింపవలసిన భారము మితముగానె యుండుటచేతను, నీ రధికముగాను వేగముగాను పాఱుట యనావశ్యకము గనుకను దంటులు బలియుటలేదు. గంగరావి, పొన్న, అవిసె యివి యత్యధికముగాఁ జిగిరించి పూచుటచేత నాకులు, కాయలు మొదలగునవి మిక్కుటముగా నుండును. వీనికిఁ గల మొత్తపు భారము మిక్కిలి యధికము. ఇంత భారమును దంటులు మోయవలసినవై యుండుటచే నవి వర్ధిల్లి యెక్కువ లావును, బలమును గలిగియుండ వలయును గాన వృక్షముయొక్క కొమ్మలు, ఆకులు పెరుగను బెరుగను క్రిందనున్న బోదెయును ఘనముగా బలియుచుండును. ప్రకాండ

మీఁదికిఁ బలియుచు, ఆకులు మొదలగువాని భాగము నహిం చుట మాత్రమే కాక, నీరు మొదలగు వానిని వేళ్లనుండి యా కులకును, ఆకులనుండి వృక్షశరీరమున కంతటికిని బ్రసరింపఁ జేయుట కుపయోగపడుచున్నది. కొమ్మలబలియుట యీ రెండు



18-వ పటము.—పోకతోఁపు.

వ్యాపారముల కుపయుక్తముగా నున్నను, జలము వీనిమా మున వేగముగాను, మెండుగాను బాఱుటకే యివి మిక్కిలి ? యుచున్నవి. ఈ విషయము వృక్షము యొక్క యవయవము వ్యాపారములను గూర్చి వ్రాయఁబడిన యధ్యాయమం జక్కఁగాఁ దెలిసికొన వచ్చును.

గుమ్మడి, చిక్కుడు మొదలగు తీఁగలయందు కొమ్మలు, ఆకులు, పువ్వులు, కాయలు మొదలగునవి మెండుగానున్నను, అవి భూమిమీఁద నైనను, ఇతర వృక్షములమీఁద నైనను, పందిళ్ళమీఁదనైనను లేక వెలుగుల మీఁదనైనను ప్రాఁకుట వలన, వానియొక్క భారము విభజింపఁబడి పెక్కుతావులందా శ్రయముగలిగి యున్నవి. తీఁగలలోని దంటుకు భారము వహింప వలసిన యావశ్యకత లేదు గనుకను, ఆకు లధికముగాఁ గలుగక యుండుటచేత జలము పూర్ణముగా నక్కఱ లేనందు వలనను వానిదంటు లావుగా బలియుటలేదు.

ప్రాఁకులలో రాగి, వేము, చింత మొదలయినవి క్రిక్కిరిసి దట్టముగాఁ బెరుగక అచ్చటచ్చట నెలితిగాఁ బెరుగుచున్నవి. ఈ ప్రాఁకులక్రింది భాగమునందు మొలిచి పెరిగెడు చెట్లకు సూర్యుని వెలుతురు బాగుగాఁ బ్రసరింపదు. కాఁబట్టి క్రిక్కిరిసి దట్టముగాఁ బెరిగిన ప్రాఁకులక్రింద చెట్లు మొలచిన యెడల చక్కగా వర్ధిల్లవు. ఒకవేళ పెరిగనేని త్వరలో నశించును. ఈ కారణమువలనఁ గృషీకులు తమ పొలములందు నీడఁ గలుగఁ జేయు గొప్పప్రాఁకులను పెరుగనీయరు. పోక, కొబ్బరి, తాటి వీనివంటి ప్రాఁకులును, జొన్న, వరి మొదలగు పైరులును అధికముగా చిగిరింపక నిటలముగాఁ బొడవునఁ బెరుగుచున్నవి గదా!

ఇదియేల ? ఈ చెట్లు దట్టముగాఁ గూడి పెరుగు స్వభావముగల వై నందున, ఒకవేళ నిడివిగాఁ బెరుగు గుణమును బొందియు న్నను నుండవచ్చును. ఎండ చక్కఁగాఁ దగులుట కిట్లు పెరుగుట మిగుల మంచిది. పొడవుగాఁ బెరుగక ప్రక్కలకు వ్యాపించిన యెడల ఈ చెట్లు ఒకదానినొకటి మరుగుపఱచి వెలుతురును ప్రసరింప నీయక యుండునుగదా ! ఈ బాధ లేకుండుట నిమి త్తమె పొడవుగాఁ బెరిగెడువాడుక యీజాతిచెట్లకు గలిగె నేమో. (18-వ పటము చూడుఁడు.)

వృక్షములలో ప్రకాండముయొక్క శాఖలు సామాన్యముగా భూమికి పైభాగమందే పెరిగి, ఎండయు, గాలియు తగులునట్లు వెలుపలనేయుండుట మనకందఱికిని దెలిసిన విషయమే. అయి నను కొన్ని చెట్లయందు ప్రకాండముయొక్క శాఖలు కొన్ని భూమికి లోపలనెయుండి పెరుగుచున్నవి. చేమ, కంద, పసుపు, అల్లము, ఉరలగడ్డ, అరఁటి వీని కొమ్మలు భూమిలోపలనె వ్యా పించి వృద్ధిపొందుచున్నవి. ఈవిధముగా వృద్ధిపొందు కొమ్మలే గడ్డలై విస్తారముగాఁ బెరుగుచున్నవి. అల్లము, పసుపు, కంద గడ్డ, చేమగడ్డ, ఉరలగడ్డ మొదలగు వానిని భూమియందుండి త్రవ్వియెత్తుట మనకుఁ దెలిసిన విషయమె. అవి పెరిగెడు స్థల మునే గమనించి దానినే ప్రధాన గుణముగ గ్రహించినచో, ఈ గడ్డల నన్నిటిని వేళ్లనియే చెప్పవలసివచ్చును.

నట్టియా వృక్షపు త్వరలో నెండి ... కు గణుపులును, మొగ్గ
సాధారణముగా నరణ్యములయందు ... గణుపుల మధ్య
లగు చెట్లయొక్క కొమ్మలమీఁద నల్లుకొని ... గా నేర్ప
పుల



17-వ పటము.—బదనిక.

పెక్కు తావులందు తోటలలోనుండు గంగరావి, మఱ్ఱి, వేప,
చింత, మామిడి మొదలగు వృక్షములపైఁ బ్రాఁకుచుండు బద

ఇదియేల ? ఈ చెట్లు [illegible]చ్చును. గం[illegible]వి కొమ్మ[illegible] నల్లకొని వై నందున, ఒక[illegible] యొక్క రూపమును, [illegible] నేల న్నను న[illegible] జొచ్చియుండు విధమును 16, 17.. వ పటము మిగుల చూపఁబడియున్నవి. ఈ విధముగాఁ [illegible]గునట్టి వేళ్ళు [illegible]బదనిక వేళ్ళు" అని చెప్పఁబడును.

---

## 4 - వ అధ్యాయము.

### ప్రకాండము.

వెలుతురును వెదకుకొనుచు భూమి[illegible] పైకి వచ్చు వృక్ష భాగమునకుఁ బ్రకాండమనియు, వృక్ష[illegible] [illegible]మొలక రూపమున నున్నపుడు ప్రకాండ మొక రెమ్మగా న[illegible] [illegible]నియు, గొప్ప[illegible] కులయందుఁ బ్రకాండము వివిధములయిన శాఖలుగలిగియుండు ననియుఁ బూర్వమే చెప్పఁబడియున్నదిగదా ? గంగరావి, పొన్న మొదలయిన వానియొక్క ప్రకాండములనుండి కొమ్మ[illegible] లనేక ములు పుట్టి పెరుగుచున్నవి. గొప్ప[illegible]కుల [illegible] మ్మలును క్రిందిబోదెయును మిక్కిలి బలిసియుండును. కొమ్మలును [illegible] టముగా నుండును. ఆముదపుచెట్టు, వంగచెట్టు వీనివంటి కు[illegible] చచెట్లయొక్క ప్రకాండములు గొప్పవిగాఁ బెరుగవు. ఇట్టి చెట్ల ప్రకాండముల నుండి కొన్ని కొమ్మలే పుట్టును. మఱియు నా కొమ్మలోపలి కొయ్యభాగము మిక్కిలి పెద్దదిగాదు.

అల్లము, పసుపు, చేమ వీనిగడ్డలకు గణుపులును, మొగ్గలును గలవు; గణుపుల మధ్యభాగములును బాగుగా నేర్పడియే యున్నవి. గణుపుల నుండి పుట్టునట్టి మొగ్గలలో కొన్ని పైకివచ్చి పెరుగుచున్నవి. ఈ లక్షణము లన్నియు కొమ్మలకేగాని వేళ్లకు లేవు. కావున మనము అల్లము, పసుపు మొదలగువాని గడ్డలను కొమ్మలని తెలిసికొనవలయును. అయినను సాధారణ కొమ్మలకును, గడ్డలై యుండు కొమ్మలకును గొన్ని భేదములు గలవు.



19-వ పటము.—అల్లము.
(మూలవహము.)

ఇవి భూమిలోఁ జొచ్చి పెరుగుటే కాక, వీనినుండి యంటువేళ్లు పుట్టును. సాధారణమైన కొమ్మలు భూమిలోఁ జొచ్చి పెరుగుటయు లేదు, వానిలో నంటువేళ్లును పుట్టవు. అల్లము, పసుపు, చేమగడ్డలు మొదలైనవి భూమిలోఁ బెరిగి వేళ్లను వహించుటవలన నివియును, వీనివలె నుండు కొమ్మలును



20-వ పటము.— పసుపు.
(మూలవహము.)



21-వ పటము.—చేమచెట్టు గడ్డయు.

"మూలవహములు" అని చెప్పవచ్చును. ఏలకులు, వస, తుం
ఈ చెట్లలోని చాలాకొమ్మలు మూలవహములే.



22.వ పటము.—ఉరలగడ్డ.



23-వ పటము.—ఉరలగడ్డ చెట్టు.

కొన్ని చెట్లలో కొమ్మలుగొన్ని భూమిలోఁ జొచ్చి పెరుగుటవలనఁ బొడవుగాఁ బెరుగక పొట్టివై బలియుచున్నవి. ఉర్లగడ్డలు ఈ జాతిచెట్లలోనివి. వీనిని బాగుగఁ బరీక్షించినయెడల పైభాగమందు నచ్చటచ్చట కండ్లవలెనుండు గుంటలు గనఁ



24-వ పటము.—ఉర్లగడ్డలు మొలచు రీతి.

బడును. ఈ గుంటలలో కొన్నిటియందు చిన్న మొగ్గ లుండును. ఈ గుంటలే గణుపుసందులు. ఉర్లగడ్డలలో గణుపులును, గణుపుసందులును నున్నవి. అయినను మూలవహములలో గణుపులును, గణుపు మధ్యభాగములును బాగుగాను బహిరంగముగాను గనఁబడునట్లు, ఉర్లగడ్డలయందుఁ గనఁబడవు. కొమ్మ

లు పెరుగక పొట్టినై బలియుటచేత గణుపు మధ్యభాగంబుల యేర్పాటు తప్పి యున్నది. ఈ చెట్లయందు గడ్డలు కలిగి యుండు కొమ్మలను చక్కఁగాఁ బరీక్షించినయెడల, వానియందు నచ్చటచ్చట గణుపులును, గణుపులయందు చిన్న చిన్న యాకులును కనఁబడుచుండును. భూమిలోఁ జొచ్చియుండుటచేత నీయాకులు తెల్లని పుచ్ఛములుగా మాఱుపడినిలుచున్నవి. గడ్డలను కొనలయందు మోసెడు నీ కొమ్మలు సాధారణ కొమ్మలె. ఇవి పైకిలేచి పెరుగుటకు బదులుగాఁ భూమిలోఁ జొచ్చి పోవు నప్పుడు, వానికొనలు నిడుపాటివికాక బలిసి గడ్డలగుచున్నవి. 22, 23-వ పటములందు నివి యున్నియుఁ గనఁబడుచున్నవి. ఇట్టి భేదంబు కలిగినకొమ్మను "గడ్డ" అని చెప్పవచ్చును.



25-వ పటము.—కందగడ్డ.

కంద చెట్టునందుగూడ గడ్డ కలుగుచున్నదిగదా! ఇదియును కొమ్మయొక్క

భేదమే. దీనియందు కొమ్మ లక్షణము లొకటియును విశద ముగాఁ దెలియనందునఁ జూడఁగానె దీనిని కొమ్మయని చెప్పఁ జాలము. మూలవహము, గడ్డ యను నీ రెండును కొమ్మలనుండి భేదపడినను, కొమ్మల గుణములు గలిగియుండుట తెలియుచు న్నది. కందగడ్డకు గణుపులుగాని గణుపుల మధ్యభాగములు గాని గనఁబడవు. మొగ్గలు మాత్రము తావు తప్పి యచ్చటచ్చ టఁ గనఁబడుచుండును. అంటువేళ్లు నుండును. ఇట్టి భేదములు గల కొమ్మలను "కందము" అని చెప్పెదము.



20-వ పటము.—ఉల్లిగడ్డ.

ఉల్లగడ్డ చెట్లలో నుల్లగడ్డలు మెండుగాఁ బుట్టునట్లు ందచెట్లలో గడ్డలు మెండుగాఁబుట్టిన, చెట్టొకటికి గడ్డ యొకటే

కలుగుచున్నది. ఉర్లగడ్డ చెట్టుయొక్క ప్రకాండపు కొమ్మలు విశేషముగా భూమిలోఁ జొచ్చి పెరుగుటచేత నీ చెట్టునందు గడ్డలు మెండుగాఁ బెరుగుచున్నవి. (23-వ పటము చూడుఁడు). కంద చెట్టునందు ప్రకాండము చిగిరింపకయె యంతయు బలిసి యొకేగడ్డ యగుచున్నది. కందయొక్క పై భాగమునందలి పల్లమునుండి పైకి వచ్చెడు కందగడ్డ కాడలు యాకుటే యగును.

మూలవహము, గడ్డ, కందయను మూటియందు మొగ్గలు మిక్కిలి యుండుటవలన వీనినిఁగోసి యాతునుకలను నాటి పైరుచేయుట వాడుక.

మీఁద వివరించియుండు భేదములుగల యీ మూడు విధములయిన కొమ్మలయందును దంటుయొక్క రూపము మారియుండినను, పరిమాణమునందుఁ దక్కువ పడకయున్నది. కొన్ని చెట్లలో ప్రకాండమంతయు రూపభేదముకలిగి, మిగులఁ జిన్నదై యుండుటయు సహజము.

ఉల్లిగడ్డ, తెల్లగడ్డ, చిఱుబొద్ది, వీనియందుఁ బ్రకాండము యొక్క దంటు కొంచెమయినను నిడివిగాక కుఱుచదై యొక్క చిన్న పళ్ళెమువలెఁ బెరుగుచున్నది. ఇట్లు పెరుగుటవలన గణుపులును గణుపుమధ్యములును లేకపోవుచున్నవి. యొ

లును ఆకులును తట్టుగానుండు బోదెయొక్క పైభాగమునం దుండును. ఆకులును రూపభేదము పొంది పొరలవలె నొకటిని



27-వ పటము.—ఉల్లిగడ్డ.

మఱియొకటి మూసికొనియుండును. బోదె మాఱుపాటునొంది యున్నట్లె, ఆకులు వన్నెయందు మాఱుపడి పెరుగుచున్నవి. ఇట్లు మాఱుపడియుండు బోదెయొక్క క్రింది భాగమునుండి, వేళ్లు పుట్టుచున్నవి. కుఱుచదైన ప్రకాండము, వేళ్లు, మొగ్గలు పొరలు నొకదాని నొకటి మూసికొని యుండుట 26, 27-వ

పటములను జూచిన యెడల విశదముగ తెలియును. ఈ రీతిగా మారుపడియుండు వానిని "లశునము" అని చెప్పుట యుక్తము.



28-వ పటము.—చిక్కుడు తీఁగ. (తిరుగుడు తీఁగ.)

చెట్లలలో ననేకములు భూమి పై భాగమునకు లేచి నిడివియై చక్కగా వర్ధిల్లు వాడుక కలిగిన వనియును, వీనియందు ప్రకాండము చిగిరింపక యొకేకొమ్మయై పొదవుగఁ బెరుగునవి కొన్ని యనియును, కొన్నిటిలో ప్రకాండము పలు తెఱుంగుల భాగింపఁబడుటచేత కొమ్మలు మెండుగాఁ గలుగుచున్న వనియును యెల్లరకుఁ దెలిసిన విషయమే.

గుమ్మడి, కాఁకర, పొట్ల, చిక్కుడు వీనివలెనుండు తీఁగలు పైకిఁ బ్రాఁకి పొడవుగాఁ బెరుగునట్టి శక్తి కలవి కావు. ఇవి యితర వృక్షములమీఁద నయినను, పందిటిగుంజల మీఁదనయినను, గోడలు మొదలయినవానిమీఁద నయినను బ్రాఁకి పెరుగుచున్నవి. ఈ ప్రకారము ప్రాఁకి పెరుగు వానిలోఁ గొన్ని తీఁగలయొక్క దంటులు వేనినైన చుట్టుకొని ప్రాఁకి పైకెక్కుచున్నవి. దీనికి దృష్టాంతముగాఁ జిక్కుడు, అలసందలు, తంబ వీనిం జెప్పవచ్చును. ఈ తీఁగలు పైకెక్కుకొనుటకు దమకాశ్రయమైన వానిని జుట్టుకొని పోవుటవలన నగుచున్నదిగాన నీలాటితీగలకు "తిరుగుడుతీగలు" అని పేరు. 28-వ పటమునందు చిక్కుడు తీగ పైకెక్కుకొను విధము కనబడుచున్నది. దీనియందుఁ దీఁగ చుట్టుకొనుట ప్రదక్షిణము. అనఁగా తీఁగ కుడిప్రక్కనుండి యెడమ ప్రక్కఁగా జుట్టుకొనుటయె.



29-వ పటము.—గుమ్మడితీఁగ.
(లతాప్రతాన [illegible]ంతము.)

అప్రదక్షిణముగా (ఎడమ ప్రక్కనుండి కుడిప్రక్కఁగా) చుట్టుకొని పెరిగెడు తిరుగుడు తీఁగలును గొన్ని గలవు.




30-వ పటము.—కాఁకర తీఁగ.

1. మగ పూవు, సులితీఁగయు. 2. మగ పూవు. 3. ఆఁడు పూవు 4. కీలాగ్రము.

పైకి ప్రాఁకిపోవువిషయమున గుమ్మడి, పొట్ల, కాఁకర మొదలగునవి పైనఁ జెప్పిన చిక్కుడు మొదలగు తిరుగుడు తీఁగలకంటె భేదపడుచున్నవి. ఇవి తమ గణుపులయందు పుట్టు నులితీఁగల సాహాయ్యమున వేనినైనఁ బట్టుకొని పైకిఁ బ్రాఁకి పోవును. ఈ నులితీఁగలకు "లతాప్రతానము" లని పేరు. లతా ప్రతానములుగల గుమ్మడి, పొట్ల, కాఁకర, బీరమొదలగు తీఁగ లను "లతాప్రతానవంతము" లని చెప్పుట యుక్తము. లతాప్ర



31-వ పటము.—అమృత లత. (ఆకుల కొనలందుండు నులి తీఁగ లను చూడుఁడు.)

తానవంతముల యందు నులితీఁగలు ప్రత్యేకమైన యంగములు. దొండ, కాఁకర తీఁగలలో లతాప్రతానము (నులితీఁగ) ఒక్కటే తీఁగగాను, పొట్లవంటి తీఁగలలో మూఁడు కొమ్మలు

గలదిగాను నుండును. కొన్ని చెట్లయందు లతాప్రతానములు ప్రత్యేకమైన యంగములుగా నుండనపుడు ఆకులు మొదలయిన వానినుండి కొంతభాగము లతాప్రతానములుగ మార్పు చెందు చున్నది. గుమ్మడి, కాఁకర, పొట్ల యీ తీఁగలయందు లతా ప్రతానములు ప్రత్యేకమైన యంగములు.

అమృతలత (Gloriosa superba) యందు (31 - వ పటము) ఆకుల కొనలు పోగువలె పెరిగి లతాప్రతానము లగు చున్నవి. పటాని చెట్లలోను నులితీఁగలు ఆకుల కొనలయం దుండును. బుడ్డకాఁకర తీఁగలలో లతాప్రతానములు పుష్పగు చ్ఛములం దుండుటచే, వీనిని పువ్వులకాడ లని యెంచవలెను. కొన్ని పువ్వులకాడలు ప్రాఁకుటకుఁగాను నులితీఁగ లగుచు న్నవి. (46-వ పటమును జూడుఁడు.)

తిరుగుడు తీఁగల మొనలును, లతాప్రతానవంతములు నులి తీఁగల కొనలును పట్టుదొరకుటకు మునుపొక తావున నె యుండక నలుప్రక్కల వ్యాపించుచుండును. ఆధారము దొరకు నంతవఱకు నవి గుండ్రముగాఁ జుట్టుచుండును. ఇట్లు చుట్టుట మిక్కిలి తిన్నగా జరుగుటచే స్పష్టముగాఁ దెలియఁబడదు. గుమ్మడి, కాఁకర, పొట్ల మొదలగువాని నులితీఁగ లాశ్రయము చిక్కఁ గానే వానికిఁ జుట్టుకొనును. ఈ నులితీఁగలు సన్నని వగుటచేఁ

గదిసిన చుట్టులను పొందును. ఈ నులితీఁగలను గమనించి చూచిన యెడల, వీనిలో నొక్కొక దానియందును రెండు తెఱఁగులగు వలయము లుండుట తెలియును. (29, 30-వ పటములు చూడుఁడు.) ఇట్టి నిర్మాణము తీఁగల కుపకారకమె. ఎందుకనఁగా, గాలి వీఁచుటవలననో, మఱి యే కారణమువలననో, తీఁగ లిటునటు కదలినను, నులితీఁగలు తెగకయుండును. మన మా నులితీఁగలను పట్టి యీడ్చి విడిచినను, ముందువలెనె వానియందు వలయము లేర్పడును.

దంటులందు దంటువేళ్లు పుట్టి, వాని సాహాయ్యమువలనను వ్యాపించునట్టి తీఁగ లనేకములు గలవు. తమలపాకు తీఁగ, మిరియాలతీఁగ యివి యిట్లు ప్రాఁకునవి. ఇట్టి తీఁగలను "మూలాశ్రిత (మూలారోహి) లతలు" అనవచ్చును.

ప్రకాండముల దంటు లి ట్లనేక మార్పాట్లు చెందినను, వానియొక్క ముఖ్య వ్యాపారము ఆకులు, పువ్వులు, కాయలు వీనిని దగినట్లు వహించుకొని యుండుటయు, ఆకులకును వేళ్లకును మధ్య నుండి, లో నుండి వచ్చు పదార్థములు చెట్టుయొక్క యన్ని ప్రక్కలకు వ్యాపింపఁజేయు మార్గముగా నుండుటయునే. కొన్ని దంటులందీ ప్రధానమైన కార్యము తగ్గి యాహారపదార్థ

ములు చేరుటకైన కణజములుగా నివి మారియున్నవి. గడ్డ, లశునము, కందము ఇవి యిటువంటివే.

---

## 5-వ యధ్యాయము.

### మొగ్గయు, ఆకును.

---

మొగ్గ యనునది ప్రకాండపు కొమ్మల సూక్ష్మాగ్రమె. ఈ మొగ్గ చిన్నదిగాను, నిడివిలేక కుఱచగాను నుండు మిక్కిలి చిన్న చిగురుటాకులచే మూయఁబడిన లేఁత కొమ్మయే. సాధారణముగా చెట్లలోఁ గొమ్మల కొనలయందు మొగ్గలుండును. ఇవి స్పష్టముగాఁ గనఁబడుచుండును. ఈ మొగ్గలు శాఖాగ్రములందు మాత్రమె కాక, గణుపు సందులయం దుండ ననుటయు, తక్కిన చోట్ల సామాన్యముగా నుండ వనుటయు ముందె చెప్పఁబడినది. రెమ్మలు విశేషముగాఁ గల చెట్లయందె మొగ్గలు మెండుగా నుండును. శాఖలు లేని చెట్లలోఁ గొన మొగ్గలు మాత్ర ముండును.

ప్రాఁకులలోను, చెట్లలోను కొన మొగ్గలు సాధారణముగా వృద్ధి యగుచుండును. ఇవి పెరుగుచుండు నంతవఱకు గ

ణుపు) సందులందలి మొగ్గలు విశేషముగా పెరుగవు. కొన మొగ్గలు మాఱురూపమును బొందిన పిదపనైనను, కారణాంతరము వలన నశించిన పిదపనైనను, గణుపు సందుల మొగ్గలు వృద్ధిఁ



32-వ పటము.—మొగ్గ.
(ఇది 30 రెట్లు పెద్దదిగాఁ జూపఁబడి యున్నది.)



33-వ పటము.—మొగ్గయొక్క యగ్రభాగము. (ఇది 500 రెట్లు పెద్దదిగాఁ జూపఁబడి యున్నది.)

జెంది కొమ్మలగును. చెట్ల కొమ్మలు బాగుగా నెదిగి, గుబురుగాఁ బెరుగుటకై, వాని నప్పుడప్పుడు కత్తిరించు వాడుక గలదు. దీనికి దృష్టాంతముగా సీమచింతచెట్ల కత్తిరించుటను గైకొన వచ్చును.

మొగ్గల కొనభాగములు మిక్కిలి సూక్ష్మమైనవి. ఇవి మోటుగా నుండుటతోఁ గూడ లేఁత యాకులతో మూయఁబడియు నుండును. ఆకులు మొగ్గలకొన ప్రదేశములందుఁ బుట్టి,

మొగ్గల దంటుకంటె మిక్కిలి శీఘ్రముగాఁ బెరుగుటవలన ముందుకు వంగి, మొగ్గల కొనభాగములను మూయుచున్నవి. (32-వ పటము చూడుఁడు.) ఈ కొనభాగములందొక చిన్న ప్రదేశము సమముగాను, నున్నగాను నుండును. దీనికిఁ గొంచెము దిగువను వెలుపల నన్నిచోట్ల మొటిమ లగుపడును. ఈ మొటిమలె క్రమక్రమమున నాకులుగాను, మొగ్గలుగాను జరుగుచుండును.

వృక్షములు నశింపక చిరకాలము పెరుగుచుండుటకుఁ గారణము మొగ్గలు నిండుగా నుండుటయే. మఱ్ఱి, గంగరావి మొదలగు చెట్ల కొమ్మలందు మొగ్గలు విశేషముగా నుండుట వలన, నీకొమ్మలను నఱికి, మఱియొక చోట నాటుటవలననే వీనివంటి యితర వృక్షములను సులువుగాఁ గలిగింపవచ్చును. కొమ్మల తునుకలను భూమిలోఁ బూడ్చి పెట్టిన పిమ్మట, వాని నుండి వేళ్లు మొలచుటవలన నవి ప్రత్యేక వృక్షము లగుచున్నవి. ఈ విధముగా నన్ని చెట్ల కొమ్మలనుండి వేఱు చెట్లు పుట్టునట్లు చేయుట సాధ్యము గాదు. కొన్ని వృక్షముల కొమ్మలకే యీ స్వభావము గలదు.

కొన్ని వృక్షముల కొమ్మలను సజాతీయములైన చెట్ల కొమ్మలతోఁ జేర్చి యంటుకట్టిన యెడల నవి వాని కంటుకొని పెరుగుచుండును. అంటుమామిడి చెట్లను దీనికి దృష్టాంతముగాఁ

జెప్పవచ్చును. తగ్గు జాతి మామిడిపిల్ల కొమ్మను నఱికి, క్రింది మొక్కతో హెచ్చుజాతి మామిడికొమ్మ నొకటి నంటించిన యెడల, నవి రెండును గలిసిపోవును. మీఁద నంటించిన కొమ్మ నుండి క్రొత్త రెమ్మలు పుట్టి పెరుగును. చెట్టునకు నంటుకట్టిన గొప్పజాతి కొమ్మయొక్క గుణము గలుగునే కాని, తక్కువ జాతి మొక్కయొక్క గుణము రానేరదు. ఇవ్విధముగా కొమ్మల నంటుకట్టక, యొక మొగ్గను మాత్రమె మఱియొక చెట్టు కొమ్మతో నంటుకట్టుటయుఁ గలదు. రోజాచెట్ల నీలాగు చేసి పెంచుట వాడుక.



34-వ పటము.—
(Bryophyllum)
రణపాలాకు. (అంటు మొగ్గలతోఁ గూడినది.)

కొమ్మల కొనలును, గణుపు సందులును మొగ్గలకు పుట్టు తావులుగాన, ఈ తావులందుఁ బుట్టునట్టి మొగ్గలు "<u>సాధారణ మొగ్గ</u>" లనఁబడును. ఈతావులందుఁ దప్పఁ దక్కిన తావులందుఁ గలుగునవి "అంటు మొగ్గ" లని చెప్పఁబడును. రణపాలాకు (Bryophyllum) నుండియు, నక్కయుల్లి యాకుల కొనల నుండియు నంటు మొగ్గలు మొలచి పెరుగుటను జూడవచ్చును. ఒక రణపాలాకు నొక

దారమునకుఁ గట్టి, యొక చిలుకునకు వ్రేలాడఁ గట్టిన మొదలఁ గొన్ని దినములలోపల నాయాకునుండి లేత మొగ్గలు పుట్టును. మఱికొన్ని దినములకు భూమి వైపున వేళ్లును, పై వైపున



35-వ పటము.—నక్క యుల్లి.

కుఁ జిన్న చిన్న యాకులుగల ప్రకాండములును గనఁబడును రణపాలాకు రూపమును, నక్క యుల్లిచెట్టు రూపంబును 34 35-వ పటములందుఁ జూపఁబడి యున్నవి. వీనియందుఁ గనఁబడ చిన్న చెట్లను జూడుఁడు.

మొగ్గల మొనలు మిక్కిలి సన్ననివి యనియు, వాని నుండి పుట్టి పెరుగు చిగుళ్లచే నవి మూయఁబడియుండు ననియు నింతకు మున్నె చెప్పఁబడినది. (32, 33-వ పటములను జూడుఁడు.) మొగ్గల మొన లిట్లు మూయఁబడని యెడల, చెడక మంచి స్థితిలో నుండ నేరవు. కొమ్మల పెంపున కీ మొగ్గల వృత్తియే కారణము.



36-వ పటము.—మట్టి కొమ్మ కొన మొగ్గ.

గణుపు సందులలో నుండు మొగ్గలు మిక్కిలి చిన్నవి. ఇవి గణుపు సందులలో నుండుటచేతఁ గంటికిఁ గానరాక మఱుఁగుపడి యుండును. కొనమొగ్గల కిట్టి కాపుదల లేదు. కావున

వీనిని లేఁతాకులు మూసికొని యుండుట యావశ్యకము. కొన్ని



37-వ పటము.—రావి కొమ్మ కొన మొగ్గ.

చెట్లలోని కొన మొగ్గలు రూపాంతరము నొందిన యాకులచేత నైనను, సంపంగి, పనస, రావి, మఱ్ఱి మొదలగు చెట్ల కొ

మొగ్గలు గణుపు పుచ్ఛముల చేతనైనను మూయఁబడి యుండుటను 36, 37-వ పటములందుఁ జూడవచ్చును. లోనుండు మొగ్గలను మూసికొనియున్న గణుపు పుచ్ఛములు వెలుపట నున్న లేఁతాకుల గణుపులందలివి.



38-వ పటము.—ఒక విధమైన జెముడు.
(Boucerosia umbellata.)

మొగ్గలు కొమ్మలుగా నెదిగిన పిదప, వానియం దాకులు మెండుగాఁ బెరుగుచున్నవి గదా? కొన్ని చెట్ల కొమ్మలయం దాకులు లేక దంటు మాత్రమె యుండును. అట్టి దంటులలో నాకులు గలిగినను జిన్నవిగా నుండి, శీఘ్రమె రాలిపోవును. ఇట్టి కొమ్మ లెల్లప్పుడు పచ్చని రంగుగలవై యుండును.

జెముడు, బొంతజెముడు, నాగజెముడు (నాగదాలి) వీనికి



39-వ పటము.—కిత్తలియాకు, ముల్లును.

కొమ్మలు మాత్ర ముండును గాని యాకులు లేవు. అన్ని యంగములును నాకు పచ్చని రంగు గలిగి యుండును. కొన్ని చెట్లలో నాకులు దట్టముగా నుండక పలచనగా నచ్చటచ్చట నొక్కటొక్కటిగ నుండుటచే, దంటు బలిసి పచ్చని వన్నెగల్గి యుండుట గలదు. నల్లేరు తీఁగను, తీఁగజెముడును దీనికి దృష్టాంతముగాఁ జెప్పవచ్చును.

మొగ్గలు కొమ్మగాఁ బెరుగుట వాడుక యైనను, కొన్ని మొగ్గలు పువ్వులగుత్తులుగా మాఱుటయుఁ గలదు. మఱియు కలివి (వాక), కిత్తలి, వెలఁగ మొదలగు చెట్ల కొమ్మలలోఁ గొన్ని మొగ్గలు కొమ్మలుగాఁ బెరుగక వాఁడిగల ముండ్లుగా మాఱుచున్నవి. (39-వ పటము చూడుఁడు.) కొన్ని కొమ్మ లాకులు లేక యుండుటయే కాక, కొన్ని చెట్లలోని కొమ్మలె యాకులుగ మాఱియుండును. చల్లగడ్డచెట్లలో సూదిలాగున సన్నగా నుండెడి యాకులవంటివె కొమ్మలు. మనము వంట చెఱకుగా నుపయోగపఱచు చౌకు మ్రాఁకులందు గుండ్రని

కమ్ములవలె నిడివియై పచ్చగా నుండునవి కొమ్మలె. గణుపులం దుండు మిక్కిలి సన్నవైన పంల్లె యాకులు.



40-వ పటము.—బెండాకు.

చెట్లయొక్క ప్రధానాంగములలో మిక్కిలి ప్రధానములయినవి యాకులు. చెట్లయందెల్లప్పుడాకులుండును. ఒద్ది, బూరుగువంటి కొన్ని చెట్లలో నొక ఋతువునం దాకులు రాలిపోయినను, రాలిపోయిన కొన్ని దినములకంత చిగిరించి, యంతట నుండును. కాఁబట్టి యాకులు చెట్ల యంగములలో ముఖ్యమయినవని యూహింపవలయును.

ఇంతవఱకు మన మచ్చటచ్చటఁ బ్రస్తాపించుచు వచ్చిన చెట్లన్నిటిలోని యాకు లన్నియుఁ దొడిమలు గలవియై

యుండును. పొన్నాకు తొడిమలు కుఱుచవి. తక్కిన చెట్లన్నిటి యొక్క యాకులకు తొడిమలు కొంత పొడుగుగా నుండును; తొడిమలు లేని యాకులును గలవు. స్పష్టాంతము:—ముల్లంగి జాతిలోఁ జేరిన కొన్ని చెట్ల యాకులు.

ఆకుల భాగములు తొడిమయు, ఆకుల విరివియు. ఈ రెంటిలోపల విరివియె యెక్కుడు ముఖ్యమైన భాగము. ఈ భాగమునకు "పత్త్ర" మని పేరు పెట్టవచ్చును. కొన్ని యాకుల తొడిమయడుగున గణుపున కిఱుప్రక్కల నుపుచ్ఛములుండును. అలసందియ, బెండ, పనస, గంగరావి, దాసాని, తంగేడు వీని



41-వ పటము.—తంగేడు మండ. (దీని యాకులు భిన్నపత్త్రంబులై పక్షమై ఈరి గలిగినవి.)

యందుండు ఆకుల తొడిమలకుఁ గ్రింది భాగమునందు నీ పుచ్ఛ



42.వ పటము.—రావి యాకు నరముల చట్రము.

ములు బాగుగాఁ గనఁబడును. కొన్ని చెట్లలో నివి లేత చిగుళ్ల తో మాత్ర ముండి, యాకులు ముదిరినతోడనే రాలిపోవును.

గంగరావి, పనసచెట్లయందలి పుచ్ఛము ఈలాటివే. ఆకుతో సంబంధపడిన యీ పుచ్ఛములు గణుపుదగ్గఱ నుండుటచే నివి “గణుపు పుచ్ఛము” లనఁబడును.



43-వ పటము ($a$):—
సమరేఖపత్రము.



46-వ పటము ($b$):—
విషమరేఖపత్రము.

ఓషధు లన్నిటిలోను నాకులు వెలుతురు సోఁకునట్లు దిగంతముగానే (వెలికిలఁగానె) యుండును. అనఁగా, ఆకుల లోపలి భాగము ఆకసము వైపునకును, మీఁది భాగము భూమి

నై పునకును నిలిచి యుండును. సాధారణముగా నాకులన్నియు విరివి గలిగి మెత్తగా నుండుట సహజము. ఇట్లు ఇవి విరివి గలిగి యుండుటకుఁ గారణము ఆకులనడిమి యీనెనుండి నలుప్రక్క-లకు వ్యాపించి, యచ్చటచ్చట వలకన్నులవంటి సందులు విడిచి యుండు నరముల చట్టమె. ఈ చట్టములోని సందులందుఁ బచ్చని వస్తు వొక్క-టి నిండియుండును. నీటియందుఁ బడి ముఱిఁగిన యాకులలో నీ పచ్చని వస్తువు నశించి పోవును గాన, నరముల చట్టము మాత్రమె నిలిచి యుండును. గుంటలలోను, పల్లములలోను బడియుండు రావి యాకులలో ననేకము లీలాగున నరముల చట్టములు మాత్రము గలిగియుండుటను జూడ వచ్చును. (42-వ పటమును జూడుఁడు.)

ఇఁకను, ఆకుల స్వరూపమునుగూర్చి గుర్తించి చూతము. అరఁటి, వచ్చిక, పసుపు, జొన్న మొదలగు నాకులనరములు భాగింపఁబడి, మఱల వలకన్నులవలెఁ జేరుట లేదు. గంగరావి, ఉమ్మెత్తవంటి చెట్ల యాకులలో నరములు విభజింపఁబడి, వలకన్నులవంటి సందులు గల చట్టము లగుచున్నవి. అరఁటి చెట్టునందుఁ బోలె నక్క-డక్క-డఁ గలియక సూటిగాఁ గొనవఱకు పోవు నరములచట్టములు గలయాకులు "సమరేఖాపత్రము" లనియు, తమలపాకు, గంగరావి మున్నగు చెట్ల యాకులందుండు



44-వ పటము.—అలసందె యాకు. (భిన్నపత్రము.)

వాని వంటి నరములచట్టములు గలిగినవానిని "విషమరేఖపత్రములు" అనియుఁ జెప్పవచ్చును.

ఆకులభాగములలో ముఖ్యభాగమైన పత్రి మన్ని చెట్లలో నొకమాదిరిగా నుండుట లేదు. కొన్నిటిలో పత్రము ఏకఖండరూపమై సమమైన యంచుగలిగి యుండును. ఆ కొంకెము తునకయై నను, కొన్నియాకులలో నంచులు చీరికలు గల్గియుండును. మఱికొన్ని యోషధులపత్రము లొంటొంటి చిఱుతయాకులుగ విభజింపఁబడియుండుట సహజమె యగును. తమలపాకు, గుంపెన గంగరావి వీనిపత్రము లేకఖండాకారములు. ఇట్టివి "సామాన్యపత్రములు" అనఁబడును. చిక్కుఁడు, కంది, అవిసె, అలసందె, బుడ్డకాఁకర మొదలగువాని పత్రములు చిఱుతయాకులుగా విభజింపఁబడి యున్నందున నిట్టివి "భిన్నపత్రము[లు]" లనఁబడును అలసందె, తంగేడు, అవిసె, వేము మొదలగువాని యాకు లొకటేసారి చిఱుతయాకులుగ విభజింపఁబ



45-వ పటము. — వేఁపాకు. (పక్షవైఖరిగల భిన్న పత్రము.)

యుండును. వీనిలోని చిన్నచిన్న యాకులు పత్రభాగము లని యెంచక, యొక్కొక్క చిన్న తుండును నొక్కొక్క పత్రమును గానే తలంపఁగూడదా యను సందియము కొందఱికిఁ గలుగ వచ్చును. సాధారణముగా, ఆకుల గణుపులందు మొగ్గలు పుట్టుట సహజము. అయితే, అవిసె, తంగేడు, మొదలగువాని చిఱుత యాకులు చేరియుండు తావులలో గణుపు మొగ్గలు పుట్టవు గాన, వానిని గణుపు లని చెప్పఁగూడదు. కావున నట్టిచోట్ల నంటియున్న యీ చిన్నాకులను పత్రభాగము లని తలంపవలయును. ఈ చిఱుతయాకులు చేరియుండెడి యీనె గణుపుతోఁ జేరికగలదై నందునను, ఈనెకును దంటునకును నడుమ



46-వ పటము.—బుడ్డకాకర తీగ. (ద్విభిన్నపత్రము.)



47-వ పటము.—గుంపెన మండ. (సామాన్యపత్రము.)

నుండు గణుపుసందున మొగ్గ లుండుటవలనను నివియన్నియు నొక్కొక యాకనియు, చిఱుత యాకులు పత్రఖండములనియుఁ దలఁపవలయును.



48-వ పటము.—తగరిసమండ. (Leucæna glauca.)
(ద్విభిన్న పత్రము.)

శీకాయ, నల్లతుమ్మ, ఒుడ్డకాఁకర మొదలగు చెట్లవంటి చెట్ల యాకులు రెండేసి మాఱులు భాగింపఁబడియున్నవి. ఇంక

వనేక తేఁపలుగ భాగింపఁబడి యుండెడి యాకులును గలవు. ఒకసారి భిన్నమయిన దానిని "భిన్నపత్రము" అనియు, రెండు తడవలు భిన్నమైన దానిని "ద్వి భిన్న పత్రము" అనియు, పలు తడవలు భిన్నమైన దానిని "బహు భిన్న పత్రము" అనియుఁ జెప్పుదము.

భిన్న పత్రములయిన కొన్ని చెట్లలో నాకులు నడిమికాడ కొలఁది ప్రక్కలఁ బట్టి ఈకెక్కల యాకులవలె మొలచుచున్నవి. అవిసె, శీకాయ తంగేడు వీని యాకు లిట్టివి. తాటియాకునందు ఈనెలును, వానినడుమును పత్ర భాగములును నుండు



49-వ పటము.—బూరుగాకు.
(చిటియాకులు తాళపత్ర వైఖరిగల్గియున్నవి.)

లాగునఁ గొన్ని చెట్లలోఁ దొడిమ కొనయందు చిన్న యాకులు చేతి వ్రేళ్ళవలె విస్తరించి యుండును. అవిసె, తంగేడు వీనివంటి చెట్లలోఁ జిన్నయాకు లుండు వైఖరిని "ఈకెక్కల

వైఖరి" యనియు, బూరుగు, ప్రత్తి వీనివంటి చెట్లలోఁ జిన్న యాకు లుండు వైఖరిని "తాళపత్ర వైఖరి" యనియుఁ జెప్ప వచ్చును.



౫0-వ పటము.—ఆముదపాకు.

ఆకులు రూపమునందుఁ గూడఁ బలుభేదంబులు గల్గియున్నవి. వాని రూపమునకుఁ దగినట్లు వానికిఁ బేరులు పెట్టనగును. రావి, గంగరావి వీని యాకుల వంటివి హృదయాకా

రము లనియు, సీతాఫలము, జువ్వి వీని యాకులును, అవిసె, తంగేడు వీని చిఱుత యాకులును, వీనివంటివియు నిడివి చౌక పు రూపు లనియుఁ జెప్పఁదగును. బుడ్డబూసర, దాసాని వీని



51-వ పటము.—ఆకుల రూపములు.

1. దీర్ఘాకారము. 2. నిడివిచౌకము. 3. బల్లెపురూపు. 4. సమ గోళాకారము. 5. అండాకృతి. 6. హృదయాకృతి.

యాకులవంటి యాకులు గోళాకారములు లేక యండాకృతులు. గుంపెన, నందివర్ధనము వీని యాకులవంటివి సమ గోళాకార ములు. అశోకము, మామిడి, గన్నేరు వీని యాకులవంటి యాకులు బల్లెపు రూపులు. గరికెపోచలవలె వెడల్పు లేక నిడి

విగల్గి యుండెడి యాకులు దీర్ఘాకృతు లనఁబడును. తామరా
కు వంటివి వర్తులాకారములు. చేమాఁకువంటి యాకులు బాణా
గ్రరూపము లనుట యుక్తము.

ఆకుల యంచులును పలువిధములైన వ్యత్యాసములు
గలవిగా నున్నవి. అన్ని యాకులలో నాకుల యంచులు కోఁ
తలు లేకయు, కొన్నిటిలో నివి కోఁతలతోఁ గూడియు నుండును.
గంగరావి, పొన్న, గుంపెన వీని యాకుల యంచులు కోఁతలు
లేనివి కావున వీని యాకులను "సమాంచలము" లనఁదగును.




52-వ పటము.—ఆకుల యంచులు.

1. సమాంచలము. 2. రంపపు పండ్లకోఁత. 3. కోఁఱదంతపు కోఁత.
4. వలయదంతపుఁ గోఁత.

కుప్పెంట, రోజా మొదలగు వానిలో నాకుల యంచుల
కోఁతలు ఱంపపు పండ్లవలెఁ గూచియైన మొనలు గల్గి, ముం

దుకు వంగి యుండును. ఈ స్వభావము గలదానిని "రంపపు పండ్ల కోఁతయంచులది" యనఁదగును. దాసాని, బెండ మొదలైన వానిలో నాకులయంచుల కోఁతలు పెద్దకోఁతలవలె ముందుకు మిక్కిలి వంగక, యించుమించు సూటిగా నుండుటవలన నట్టి స్వభావము గల యాకులను "కోఁటు దంతపు కోఁతయంచులవి" యనుట తగును, మఱియుఁ గొన్ని యాకులలోని యంచులలోని పండ్లు వాఁడిమి లేక యుంగరములమాడ్కి గుండ్రముగా నుండుటయుఁ గలదు. దీనికి నుదాహరణముగా రణపాలాకులయంచులను గైకొనవచ్చును. ఇట్టివానిని "వలయ దంతపు కోఁత యంచులవి" యని చెప్పుట మిక్కిలి యొప్పియున్నది. ఈ యాకులయంచులకోఁతలు పలుతెఱంగులైనవి పటములందుఁ జూపఁబడి యున్నవి.

ఆకులయంచులు సరియైన కోఁతలు, లేక, పెద్దచెవులు గలిగియుండుటయుఁ గలదు. దృష్టాంతముగా ముల్లంగి, బ్రహ్మదండి, ఆముదపుచెట్ల యాకులయంచులను జెప్పవచ్చును. ముల్లంగియాకుల యంచులకోఁతలు సమముగానుండక హెచ్చుతక్కువలుగలవి. ఆముదపాకులయంచు లన్ననో తాళపత్ర వైఖరిని బొంది యున్నవి. (52-వ పటమును జూడుఁడు.)

ఆకులు దంటుతోఁ జేరి యుండు తావునకు గణుపని యు, అట్టి గణుపున కొక్కొంటికి నాకు లొక్కటొక్కటిగానైనను, జంటజంటగానైనను నుండు ననియు ముందె చెప్పఁబడెను గదా. గంగరావిచెట్టునందు వలెనె యనేక క్రమాంకులలోను, చెట్లలోను కొమ్మల దంటుల గణుపున కొక్కటికి నొక్క యాకే యుండును. అదియునుగాక, యాకులు కుడి యెడమప్రక్కలు మార్చిమార్చియైనను, లేక నడిమిదంటు చుట్టును నైన నుండును. ఇట్లు గణుపులలో నొక్కొక్కటియె యుండుట వలన నిట్టి యునికకి "ఒంటరి చేరిక" యని పేరిడుట మిక్కిలి యొప్పి యున్నది. మఱియొక విధమైన యాకుల చేరికను పొన్న చెట్లలోఁ జూడనగును. ఈ చెట్టునందు గణుపులలో నాకు లొకటికొకటి యెదురెదురుగాను, హెచ్చుతక్కువలు లేక



౫౩-వ పటము.—ఏడాకుల పాలమండ.
(అభిముఖ చేరిక.)

సమముగాను జేరియున్నవి. పొన్నకొమ్మలదంటులలో గణుపున కొక్కటికి రెండురెండాకులే యుండును. గుంపెనచెట్లలోను నిట్లె. గణుపులలో నిత్తెఱంగున నెచ్చుతక్కువలు లేక సమముగా మూడు, నాలుగు, లేక యయిదు, వానికంటె నెక్కువ యాకులు చేరియుండుటయుం గలదు. 64-వ పటమునం జూపంబడ్డ యేడాకులపొన్న కొమ్మయొక్క రూపమును జూడుఁడు. దాని గణు పొక్కటికి నాల్గాకు లుండుటను గమనింపుము. గన్నేరుకొమ్మల దంటుల గణుపులలో నొక్కటొక్కటికి మూడేసి యాకు లుండును, రెండాకు లున్నను, లేక, మూడు, నాలుగు, వానికంటె హెచ్చుగా నున్నను, ఉనికి యొక్కతీరే గదా! ఈలాటిచేరికకు "అభిముఖ చేరిక" యని పేరు పెట్టుదము.

గణుపులలో నాకులకూడిక యీ రెండువిధములె గలది. ఓషధులన్నిటిలోను గణుపులతో నాకులు కూడి యుండుట యీ రెండు విధములలో నొక్కటిగానే యుండవలయును.

ఆకులు విరివిగలవిగాను, సన్నవిగాను, పచ్చరంగులవిగాను, తమమీఁద వెలుతురు చక్కఁగా సోఁకునట్లు కొమ్మల దంటులలో పొందికగా నమర్పఁబడియు నుండును.

రెండవ యధ్యాయమునందుఁ గొమ్మలు వెలుతురును వెదకుచుఁ బైకిఁ బెరుగుచుఁ బోవు ననియును, చీఁకటి గల తావులందున్నను, వెలుతురు గల చోట్లకుఁ బోవ శక్తి గల్గి యున్నవనియును జెప్పఁబడెను. ఆకులయొక్క విరివి, సన్నదనము, దంటులలోఁ జేరి యుండు రీతి, పచ్చని రంగు అనునివి యాకులు సూర్యరశ్మిని బొంది తాము చేయవలసిన కార్యములకుఁ దగిన సాధనములె.

ఇంచుమించుగా నన్ని యాకులును పచ్చని రంగు గలవియె. ఈ రంగు లేనివాని నాకు లని చెప్పుట లేదు. విరివి, సన్నదనము, పచ్చన యను గుణంబులు గల్గి యుండుటయె కొమ్మలయొక్క స్వభావము. ఈ పచ్చదనము లేఁతకొమ్మల దంటులకున్నను, విశేషముగా నాకులకె యీ వన్నె గలదు.

ఆకులు వృక్షమునందు మిక్కుటముగా నుండు టేల? అవి పచ్చని రంగే కలిగి వెలుతురును కోరి, వెలుతురు విశేషముగా నున్న ప్రదేశములందె మిక్కిలి కలుగుచుండుట యేల? ఈ యేర్పాటు లన్నియు నాకులు చేయునట్టి పనుల కుండియె తీరవలెను. ఆకులు సాధారణముగాఁ బచ్చగా నుండుట చేతను, వెలుతురును వెదకుటచేతను బచ్చని రంగును, వెలుతు

రును ఆకులు చేయునట్టి పనులకు మిక్కిలి యుపయుక్తము లైనవి యనియె మన మెంచవలయును.

చెట్లలో నాకులు వ్యాపించి యుండురీతిని గమనించి



54-వ పటము.—ఫిట్టోనియా (Fittonia.)

చూచిన యెడల నాకులు కూడినంతవరకు నొక్కొటి నొక్కొటి మఱుగుపఱుపక వృద్ధి నొందుట చక్కఁగాఁ గానఁబడును. పొన్న కొమ్మవంటి కొమ్మలందు దాకు లొక్కొటి కొక్కొటి యెదురెదురు గాను, ఆకుల యీనెల జత లొకదాని కొకటి యడ్డముగాను



55-వ పటము.—బుడ్డబూసర చెట్టు.

నుండుటయు, గంగరా
వి మున్నగు చెట్లలో
నాకు లొంటిచేరిక గల్గి
యుండుటయు నాకు
లొండొంటిని మిక్కిలి
మఱుగు పఱపక వృద్ధి
నొందుట కేర్పడిన యు
పాయంబులై యున్నవి.
మరియు నిట్టి యుపా
యంబులు పెక్కులు గ



56-వ పటము.—కుప్పింట చెట్టు.

లవు. వానిలోఁగొన్నిటి నిక్కడ ముద్రింపఁబడియుండు 54, 55, 56-వ పటములను జూచి తెలిసికొనవచ్చును.

---

## 6-వ అధ్యాయము.

### పుష్పములు, వానియంగములు, వాని పర్యాయము.



ప్రకాండముయొక్క భాగములగు ఆకు, మొగ్గ మొదలగునవి చెట్లయొక్క వృద్ధికి మిక్కిలి యావశ్యకములు. ఈ యవయవములపని ఆహారపదార్థములఁ జేర్చుటయుఁ గొమ్మలను బెంచుటయునే. ప్రకాండములం దాకులు, మొగ్గ లెప్పుడు నుండుననియు, కొన్నిఋతువు లందు కొమ్మలలో కొన్నింటిలో పుష్పములు, ఫలంబులు వృద్ధి నొందుట గలదనియు ముందే చెప్పఁబడినది గదా.



57-వ పటము.—

గంగరావి పూమొగ్గలు.

పుష్పము ను చెట్టుయొక్క యొక యంగమె. చెట్లయొక్క పెంపునకీ యంగ మనావశ్యక మయినను, చెట్లసంతతి వృద్ధి

యగుటకు ముఖ్యసాధన మిదియె. పూవుల నిర్మాణమును స్వభావమును దెలిసికొనుట కింతవఱకుఁ బ్రస్తావింపఁబడుచున్న చెట్లపూలె పనికి వచ్చును.

గంగరావి కొమ్మలలోఁ బువ్వులు గణుపుల సందులం దొక్కటి యొక్కటిగా నిడుపైన తొడిమతోఁ గూడఁబుట్టి, పెరుగుచున్నవి. ఈ నిడుపు తొడిమలు వృంతము లనఁబడును. ఈ పుష్పవృంతము యొక్క కొనయందు వెడల్పయిన యొక్క గిన్నె పుష్పము యొక్క తక్కిన భాగముల నన్నింటినిదనలోనికిఁగొనియున్నది.మిక్కిలిలేఁతదైన కాయ మొగ్గలలో నీ గిన్నె లోపలనుండు తక్కిన పుష్పావయవముల నన్నిటిని జక్కఁగా మూసికొని యుండును. మొగ్గ పెద్దది గానుగాను, గిన్నె పై భాగంబునఁ దెఱచుకొనును: కావునఁ దక్కిన యవయవములు బయటికి వచ్చి పెరుగుచుండును. గిన్నెవలె నుండు నీ భాగము పుష్పమునకు బయట నుండుటవలనను, తక్కిన పుష్పావయవము లన్నియు దీనిలో నడఁగి యుండుటవలనను, దీనికి "పుష్పకోశము" అని పేరు పెట్టఁదగును.




58-వ పటము.—గంగరావి పువ్వు భాగములు.
1. పుష్పకోశము, రెండు దళములు, అండాశయము 2. పుష్పకోశము. అండకోశము.

కొన్ని గంగరావి మొగ్గలలో పుష్ప కోశముయొక్క గిన్నె కడుగున వెలుపట మూడు చిన్న పుచ్ఛము లంటుకొని యుండును. పెద్ద మొగ్గలలోను పువ్వులలోను నీ పుచ్ఛములు గానరావు. ఇవి వానిలో రాలిపోవుచున్నవి. పుచ్ఛము లున్న చోట్ల గుఱుతులు మట్టుకు కనంబడుచుండును. అనేక ఇతర పుష్పములకు నిట్టి పుచ్ఛము లుండుట స్వాభావికమే. ఇవి వృంతముయొక్క కొన నుండుటచే వీనిని "వృంత పుచ్ఛములు" అనవలెను.

పుష్పకోశ మనునది పుష్పమునకు వెలుపలి భాగము. దీనిలోపలి భాగమున గంగరావి పూవులో సొగసైన పసుపు పచ్చని యైదుదళములు గలవు. ఆదళము లొక్కదానితో నొక్కటి చేరక విడివిడిగా నుండును. వీనికి "దళములు" అనియు, ఈ యైదింటియొక్క చేరికకు "దళచుట్టు" అనియుం బేరు. ఈ పుష్పములందు లోపలనున్నట్టి యితరములైన యంగములు దళములవలె మనోహరముగాం గనంబడవు. గంగరావి పువ్వు



59-వ పటము.—గంగరావి మొగ్గ. 1. గంగరావి మొగ్గ యొక్క నిడివికి కోసిన చీలిక, 2. కేసరగొట్టము, కీలము.

నడుమను నిడుపైన కమ్మివంటి దొక యంగము గలదు. ఇది రెండు లోభాగములు గలది. వీనిలో నొకటి గొట్టములాగునఁ గనఁబడుచు, సూదివలె సన్ననై యుండు మఱియొక్క భాగమును చుట్టుకొని యుండును. ఈ గొట్టమునకు వెలుపటఁ జుట్టును నున్నట్టి సన్నని పోఁగువంటి కమ్ములకొనలలో పసుపు వన్నె గల బుడుపు లేర్పడి యుండును. ఈ గొట్టమునకు "కేసరపు గొట్టా" మనియు, బుడుపులకు "మకరందపు తిత్తు" లనియుఁ బేరు. కేసరపు గొట్టములో చీలవలె నున్నది "కీల" మనఁబడును. ఇది క్రిందిభాగమున పిందెతో సంబంధపడి యుండుటయె కాకవీనికొన లావై యైదుమిట్టలును, నైదు పల్లములును గల్గి యున్నది. కీలముయొక్క కొనకు "కీలాగ్రా" మనియు, పిందెకు "అండాశయము" అనియు, కీలము, కీలాగ్రము, అండాశయము అను నీ మూటికిఁ జేరి "అండకోశము" అనియుఁ బేరు పెట్టవచ్చును.

తఱుచుగాఁ బుష్పములన్నింటిలో నీ భాగములె గలవు. కావున మన మింకను గొన్ని పుష్పములను పరిశోధించుట మంచిది గనుక గంగరావికుటుంబమునఁ జేరిన కొన్ని పుష్పములను బరిశోధించి చూతము. దాసాని, ప్రత్తి, బెండ, తుత్తురి యీ చెట్లలోని పూవులు ముఖ్యములైన యంశములలో గంగరావి

పూవును బోలియున్నను, మఱికొన్ని యంశములలో మాఱు



60-వ పటము.—దాసానిమండయుపువ్వులు.
1. గణుపుపుచ్ఛము. 2. గణుపుసందు. 3. వృంతము. 4. వృంతపుచ్ఛములు. 5. పుష్పకోశము. 6. దళచుట్టు. 7. కేసరగొట్టము. 8. కీలాగ్రమే.

పాటు చెంది యున్నవి. ఈ పుష్పములన్నిటిలోను బుష్పకోశము గిన్నెగాన యున్నది. గంగరావి, ప్రత్తి యీ రెండు పూవులలో పుష్పకోశపుగిన్నె యంచునందైదు సూక్ష్మపు చీలికలు గానఁబడును. ఇవి మిక్కిలి సూక్ష్మములుగానుండుటచే గమనించి చూచినం గాని తెలియవు. కనుమొగ్గలలో నీ చీలికలు చక్కఁ గాఁ గానఁబడును. ముదిరిన పూవులలో నివి నశించి పోవుచున్నవి. దాసాని, తుత్తిరి యీ పువ్వులందలి పుష్పకోశముల యొక్క యోరలలో నుండు చీరికలు పెద్దవిగా నుండుటచే జక్కఁగాఁ గనఁబడును బెండపూవు యొక్క పుష్పకోశ మొక్క గూడుగానె యుండి

పిదప నొక యంచునఁ జీలఁగా, లోపల నుండు భాగములు వెలుపలికిఁ దల యెత్తుచుండును. (62-వ పటమును జూడుఁడు.)

వృంతపుచ్ఛములు ముందుఁ జెప్పిన చొప్పున గంగరావి పువ్వులలో మూడు గలవు. ప్రత్తిపూవునకును మూడు పెద్ద వృంతపుచ్ఛములు గలవు. కాయలు పండి, యెండి చిట్లినంత వఱకును నీ వృంతపుచ్ఛము లంటుకొని యే యుండునవి. బెండ, దాసాని యీ పువ్వులలోని వృంతపుచ్ఛములు పుష్పకోశము యొక్క యడుగుభాగమును చుట్టుకొని వస్త్రలనముగా నుండును. ఇవి లెక్కపెట్టిన నెనిమిది మొదలు పదివఱకు నుండును. తుత్తిరిపూవులలో వృంతపుచ్ఛములు లేవు. అవ, ముల్లంగి పూవులును వృంతపుచ్ఛ రహితములు.

ఇక్కడ వివరింపఁబడిన పూవులలో నన్నిటియందును నొకటితో నొక్కటి చేరక ప్రత్యేక ప్రత్యేకముగా నుండెడి యయిదు దళములు గలవు. ఇవి వృంతపుకొననుండి పుష్పము యొక్క రెండవ చుట్టుగా నున్నవి. ఇవి పరస్పరము భిన్న వర్ణములును, భిన్నరూపంబులునై యున్నవి. బెండ, గంగరావి, ప్రత్తి వీని పువ్వుముల దళములు పచ్చనివి. దాసాని, ఎఱ్ఱ ప్రత్తి యీపూవుల లెఱ్ఱనివి. తుత్తిరిపూవుల దళచుట్టు కిచ్చిలి పండు వన్నె గలది.

మూడవ చుట్టగు కేసర మన్నింటిలో నొక తీరుననే యుండును. కొన్ని కేసరములలో మకరందపు తిత్తులను మోసెడు తంతువులు మెండుగాను, దట్టముగాను నుండును. మఱి కొన్నిటిలో నీ తంతువులు దట్టముగా నుండక, పలుచనగా నుండును. కొన్నిటిలో నివి నిడివివి. మఱికొన్నిటిలోఁ గుఱుచనివి.




63-వ పటము.—ఉమ్మెత్తపూవు, దాని భాగములు.

1. పువ్వు. 2. పుష్పకోశము, అండకోశము. 3. అండకోశము. 4. దళచుట్టును, కేసరములును. 5. కేసరము.

గంగరావి పూవులలోని కీలాగ్రము చీలికలు లేనిది. తక్కిన పువ్వులలో దీనికి చీలిక లుండును. బెండ పూవులోను,

దాసానిపూవులోను కీలాగ్ర మైదు చీలికలు గలదై యుం డును. తుత్తిరి పూవులలోని యీ కీలాగ్రమున కిరువది చీలికలు గలవు.




64-వ పటము.— పొన్నపూల గెల.
1. గెల. 2. పూవు. 3. దళము, వెలిదళము. 4. కేసరములు. 5. అండకోశము.

తుత్తిరి పువ్వులలో నండాశయ మిరువదికంటె నెక్కుడయిన గదులు గలది. ప్రత్తిపువ్వునం దండాశయము మూడు గదులును, దాసానిపువ్వునం దయిదు గదులును, బెండ పువ్వునందు గదులైదు మొదలెనిమిదివఱకును నుండును.

భూమియందుండు పుష్పములన్నింటిలోఁ బైఁజెప్పిన భాగంబు లన్ని యున్నను పరిపరివిధముల భిన్నములై యున్నవి కనుక మఱికొన్ని పుష్పములను బరిశోధించి చూచుట మంచిది ఉమ్మెత్త, పొన్న, అవిసె వీనిపూవులను బరిశోధించినమాత్రము

ఉమ్మెత్తపువ్వులు మిక్కిలి కుఱుచతొడిమలతోఁగూడి గణుపుసందుల నుండి ప్రత్యేక ప్రత్యేకముగానే పుట్టి పెరుగు చున్నవి. పుష్పకోశము గొట్టములాగున నుండి నోటియంచు



65-వ పటము. ఉమ్మెత్తపువ్వును, దాని భాగములును.

నం దైదు చీరికలు గలదై యున్నది. ఈ పుష్పమునందు వృంతపుచ్ఛములు గలుగుట లేదు, రెండవ చుట్టగు దళచుట్టు తెల్లపాటి, యొకటిగాఁ గలిసికొని, "ఫొన్నల్" అని చెప్పఁబడు పోతగొట్టమువంటి రూపము గల్గియున్నది. దళచుట్టు

ను పుష్పమునుండి యూడఁబెఱికి, యొకప్రక్కనఁ జీల్చి విరియఁదీసి, లోపలఁ జూచినయెడల, సైదు తంతువులు దళ చుట్టు గొట్టముయొక్క యడుగున నంటుకొని యుండును. వీని కొనలందు నిడివియైన మకరందపుసంచులు గానవచ్చును. ఈ యైదు తంతువులును గేసరములె. మకరందపు తిత్తులు విడిచి తక్కిన తంతువులు "కేసరపుకాడ" లనఁబడును. పుష్ప ము నడుమ నండకోశము గనఁబడుచున్నది.

పొన్నపువ్వు లొక్కటొక్కటిగా నుండక గుమిగూడి, యుక్త తరుణములందు గుత్తులుగుత్తులుగ, విశేషముగాఁ బూ చుచున్నవి. పూలగుత్తునన్నియు గణుపు సందులలోఁ బుట్టి పెరుగుచున్నవి. ఈ పుష్పమునందు పుష్పకోశమును, దళచుట్టు ను ప్రత్యేక దళములు గలవి. ఈ రెండు చుట్లును తెల్లనివే. వీనిలోఁ గేసరములు విశేషముగా నుండును. అవి యన్నియు వేలువేలుగానే యున్నవి. అయితే, అవి యయిదుకూటము లగునట్లు కేసరపు కాడయొక్క యడుగునఁ జేరియుండును. కేస రములను వీడఁదీసి చూచిన నీ విషయము బాగుగా బోధపడును. తక్కిన పుష్పములం దుండునట్లె దీనియందును నండాశయము నడుమ నుండుటయె కాక, దీనితో కీలమును, కీలాగ్రమును చేరిక గల్గియున్నవి.

అవిసె పువ్వునందు దళములు ప్రత్యేకప్రత్యేకముగాను



66-వ పటము.—అవిసె పువ్వు, దాని భాగములును.

తెల్లగాను నుండుట స్వాభావికము. కొన్నిటిలో నీ దళము లెట్టిగా నుండును. వీనిలోఁ బుష్పకోశము గిన్నెవలె నుండి వృంతపుచ్ఛ రహితమై యుండును. దళములు ప్రత్యేకప్రత్యేకములుగా నుండుటతోఁ గూడ, రూపమునందును బలుతెఱఁగులైన మాఱుపాట్లు నొంది యున్నవి. అయిదు దళములలో నొక్కటి పుష్పముయొక్క యూర్ధ్వ భాగంబున టెక్కమువలె నున్నదిగదా. తక్కిన నాలుగింటిలో రెండడుగునను, రెండు ప్రక్కలందును నున్నవి. క్రింది దళములు రెండును జేరి దోనెవలె నున్నవి. ప్రక్కలలో నుండు రెండు దళములును కొడవలియలుఁగువలె నున్నవి. వీనివంటి దళచుట్టుగల పుష్పములు పెక్కు లుండుటచే నీ

దళములకు సంజ్ఞానామము లేర్పఱచుట ముఖ్యమైయున్నది. పైన నెత్తుగానుండు దళమునకు "పతాకదళము" అనియు, పార్శ్వములనుండు వానికి "పక్షదళములు" అనియు, క్రింద నుండుదళములకు "ద్రోణీదళము" లనియుఁ బేరు పెట్టవచ్చును.

అవిసె పూవునందు మూడవ చుట్టగు కేసరములు పది యుండుటయు, వానిలో నొక్కటి ప్రత్యేకముగాను, తక్కిన వొక్కదానిలో నొక్కటిచేరియు నుండును. పుష్ప మధ్యమున కేసరములందు మఱుఁగియున్న నిడుపాటి తంతువువంటిదే యండకోశము.



67-వ పటము.—పూవులగెల.

పొన్న, అవిసె యీ రెండుచెట్లలోను బూవు లొక్కటికొక్కటిగా నుండక మంజరులుగాఁ జేరి పూఁచుచున్నవిగదా. అట్లే యనేకములైన యోషధులందుఁ బుష్పములు గుంపుగాఁ గూడి మంజరులై పూఁచుచున్నవి. పొన్న అవిసె వీని పూ మొగ్గలన్నియు వృంతముతోఁ గూడి

నడిమి కాడయందుఁ జేరియుండునట్లు, అనేక వృక్షముల మంజ రులందు మొగ్గలు చేరియుండుట స్వాభావికము. కేల, తం గేడు వీనియందలి పూవు లిట్టి యునికి గలవి. ఏ చెట్టునం దలి మంజరియైనను నిట్టి విన్యాసము గలిగి యుండినయెడల, దానిని "గెల" యని చెప్పుట యుక్తము.

ఉత్తరేణి, సజ్జ (68,69-వ పటములు.) ఈ చెట్లయందుఁ బుష్పములు వృంతములు లేక నడిమి కాడతోఁ జేరియుండును. ఈలాటి పొందికగల గుచ్ఛముల ని "కంకి(ఎన్ను)" యని పేరిడు ట యుక్తము. గెల, కంకియను రెండు తెఱఁగులైన గుచ్ఛముల లోను పుష్పములు నడిమికాడ యడుగునుండి కొనవఱకును బ లుతావులందుఁ జేరియుండును. కొన్ని చెట్లలోఁ బుష్పములన్ని యు నడిమికాడయొక్క కొన



68-వ పటము ఉత్తరేణి కొమ్మలు.

యందొక్క తావుననే యుండు ను. దృష్టాంతముగా కొత్తిమిరి, తులసిగట్టి, జిల్లేడు (70-వ పట ము.) మొదలగు చెట్లలోని పుష్పగుచ్ఛములఁ జూడుఁడు. ఇట్టి

చేరికగల పుష్పమంజరులను "గుత్తి" యని చెప్పుట యుక్తము. గుత్తిలోనుండు పుష్పములు వృంతములతో నడిమికాడయొక్క కొనయందె చేరియున్నవి.



69-వ పటము.— సజ్జకంకులు.

అనేక పుష్ప వృక్షములలో పుష్పములు వృంతములు లేక నడిమికాడల కొనలందుఁ దామె చేరియుండుటయుఁ గలదు.

ప్రొద్దుతిరుగుడు (70-వ పటము.), చేమంతి, గుంటగలిజేరు, నల్లతుమ్మ, తెల్లతుమ్మ మొదలగు పువ్వులు వృంతములు లేనివై నడిమి కాడల కొనలందు వెడల్పైన భాగంబునందుఁ జేరియున్నవి. ఇట్టి నిర్మితిగల పుష్పములకు " బంతి " అని పేరు. ఇట్టి భేదములను చక్కఁగాఁ దెలియునిమిత్తము 72, 73-వ పటములలో వీని రూపములు చూపఁబడి యున్నవి.

గెల, కంకియును నీరెండు తెలుఁగులైన మంజరులలోని పుష్పములను గమనించి చూచినయెడల, మఱియొక్క విషయము తెలిసికొనవచ్చును. వీనిలో మొగ్గలు నడిమి కాడకొనను, పూవులు నడిమి కాడ యడుగునను నుండును. అనఁగా పూవు లడుగునుండి కొనకుఁ బుష్పించుచుఁ బోవును. కావున వీనిలో పుష్పములు సొంపుగాఁ గల



70-వ పటము.—జిల్లేడుపుష్పములు.

వు. ఈ మంజరులలో నెన్ని పుష్పములై యున్నవి యని లెక్క
పెట్టఁ దరముగాదు. ఏల యనిన, నడిమికాడ పెరుగుచువచ్చిన
మొగ్గలును మిక్కిలి కలుగుచునే యుండును.



71-వ పటము.—ప్రొద్దుతిరుగుడు పూబంతి.

గుత్తి, బంతి యను మంజరులలోను పువ్వులు పూఁచు
నట్టి పద్ధతి యిట్టిదే. అయితే, వాని యునికి చదరముగా ను
డుటవలనఁ బ్రాఁతపూవు లంచులలోను, క్రొత్తపువ్వులు నడి
మను నుండును. అంచులలోనుండి నడిమికి పువ్వులు పూఁచుచు
వచ్చును, అనఁగా, మొదట నంచులలోని పూవులు పూఁచును

పిదప వానికంటె లోపలిభాగంబుననుండు పూవులు, పిదప నింకను లోపలనుండునవి యిట్లు వరుస క్రమమున వికసించును.



72-వ పటము.—బంతులయమర్పు.




73-వ పటము.—బంతులయమర్పు.




74-వ పటము.—పుష్పపర్యాయములు.
1. గెల. 2. కంకి (ఎన్ను). 3. గుత్తి.

గెల, కంకి, బంతి వీనియందు పువ్వులు పూఁచుపద్ధతికి "మధ్యాభిసరణము" అని, ఈలాటి పద్ధతిగల పుష్పమంజరులకు "మధ్యాభిసారి మంజరులు" అని పేరు పెట్టుటయుక్తము. కొన్ని పుష్పమంజరులలో ముదిరిన పువ్వులు నడుమనైనను, కొనయందైనను నుండును. కసు మొగ్గ



75-వ పటము.—సాధారణ మధ్యారంభిమంజరి.

లంచులం దైనను నడుగునసైన నుండును. వీనిలో పువ్వులు నడుమనుండి వెలుపలికై నను, కొననుండి యడుగున కైనను బూఁచుచు వచ్చును. అనఁగా నిట్టి వానిలోఁ బుష్పించు క్రమము నడుమనుండి వెలుపలికి పోవును.

ఈలాగు పుష్పించు పద్ధతికి "మధ్యారంభ" మనియు, నిట్టి పద్ధతిగల పుష్ప మంజరులకు "మధ్యారంభి మంజరు" లనియుఁ బేరు పెట్టవచ్చును.

మధ్యాభిసారి మంజరులందు గెల, కంకి, గుత్తి, బంతియని యవాంతర భేదములుండు నట్లు, మధ్యారంభి మంజరులలోను నవాంతర భేదము లున్నవి. ఆ మధ్యారంభి మంజరులలో మూడు మొగ్గ లున్నప్పుడు, నడిమిది పుష్పమై ముదిరి, యిరు ప్రక్కల నున్నవి కను మొగ్గలుగా నున్న యెడల, నట్టి మంజరిని "సాధారణ మధ్యారంభి మంజరి" యనియు, ఇరు ప్రక్కలనున్న మొగ్గలకు బదులుగా నిట్టి మధ్యారంభి మంజరులే యచ్చట నున్న యెడల, నట్టి మంజరిని "ద్విప్రంత మధ్యారంభి మంజరి" యనియుఁ జెప్పుట యుక్తము. సాధారణ మధ్యారంభి మంజరులు మల్లె, మొల్ల, కలివి మొదలగు వానిలోను, ద్విప్రంత

మధ్యారంభి మంజరులు గన్నేరు, కోడిసెపాల, కాంకర, నందివ ర్ధనము మొదలగు చెట్లలోను జూడవచ్చును.



76-వ పటము.—ద్వివృంత మధ్యారంభి మంజరి.

ఇచ్చట వివరించిన గెల, కంకి, గుత్తి వీనియందు నడిమి కాడ చీలికలు లేక యొక్కటిగా నైనను, కొమ్మలుగా చీలినై నను నుండును. మనము దృష్టాంతముగాఁ గైకొన్న వానిలో నన్నిటిలోను నడిమికాడ యొకటె. వీనిలోఁ బుష్పములు వృ

త సహితములుగా నైనను, వృంత రహితములుగా నైనను నడిమికాడతోం జేరియుండును.



77-వ పటము.—పుష్ప పర్యాయములు.

1. రెమ్మగెల. 2. రెమ్మకంకి (ఎన్ను). 3. రెమ్మగుత్తి.

తంగేడు వంటి చెట్లయందు నడిమికాడ పలురెమ్మలుగాం జీలి యుండును. అనంగా నడిమికాడయందుం బుష్పములు కాడల తోంగూడి యుండుకొని యుండునట్లు, గెలలు నడిమికాడ యందు నంటుకొని యుండును. ఇట్టివి "రెమ్మగెల" లని

చెప్పఁబడును. ఇట్లే రెమ్మ కంకులు, రెమ్మ గుత్తులును పుట్టి పెరుగుచున్నవి. 77-వ పటమును జూడుఁడు.

పుష్పమంజరు లీ రెండు తెగలలో నేదైన నొకటిగానుం డునని తలంపరాదు. ఒక మంజరి మధ్యాభిసారిగాను, మఱియొకటి మధ్యారంభిగాను నుండుటయే కాక ఒకటే మంజరి మధ్యాభిసారము,మధ్యారంభము అను పర్యాయములను రెంటిని గలదిగా నుండినను నుండవచ్చును. వావిలి, తులసి, పద్రజడ వీనియొక్క మంజరులను దృష్టాంతముగఁ జెప్పవచ్చును.

ప్రొద్దుతిరుగుడు చెట్టునందు పూబంతియొక్క నడిమికాడ కొన మిక్కిలి వెడల్పుగలదై, తట్టవలె మాఱియుండును. దాని మీఁదనే పుష్పములు చేరియున్నవి. కొన్ని చెట్లయందు నిట్లు మాఱుపాటునొందిన వృంతముయొక్క తట్టలోనుండు పుష్పములు మిక్కిలి సన్ననివిగా నుండును. ఈ తట్ట వృంతము శ్రేనిదై గిన్నెవలె పెరిగి లోపలఁ బుష్పములను గలిగియుం డును. మఱ్ఱి, అత్తి, రావి యీ చెట్లయందు మనము కాయలని భ్రమించునవి పుష్పగుచ్ఛములు. బయటికిఁ గనఁబడు చర్మము వృంతపళ్లెరము. లోపల నంటుకొనియుండునవి పుష్పములు. వీనిలోపలి నిర్మాణము కాయలనుగూర్చి చెప్పఁబడు నధ్యాయమునందు వివరించి చెప్పఁబడును.

## 7-వ యధ్యాయము.

### పుష్పముల పొందికయు, వాని వ్యాపారములును.



వృంతము, వృంతపుచ్ఛము, పుష్పకోశము, దళములు, కేసరములు, అండకోశము ఇవి పుష్పముల యంగము లని మనము తెలిసికొని యున్నాము. ఈ యధ్యాయంబున వీని నిలుకడతీరుంగూర్చి విచారించి తెలిసికొనుట యావశ్యకము.

గంగరావి మొగ్గలను, పువ్వులను గమనించి చూచిన యెడల, పుష్పకోశము, దళచుట్టు మొదలగు భాగంబుల చేరికసొంపు చక్కఁగాఁ దెలియును. మొగ్గలలోఁ బుష్పకోశపుగిన్నెయొక్క యంచుయందైనను చిన్న చీలికలు గనఁబడును. గమనించి చూచిన యెడల, పూచిన పువ్వుల పుష్పకోశములలోఁ గొన్నింటి యందైనను నీ చీలికలు గనఁబడును.

పుష్పభాగములను ప్రత్యేకముగాఁ దీసిచూచిన యెడల, పుష్పకోశమువలెఁ దక్కినభాగంబులును వృంతాగ్రమునందుఁ గలిసియుండుటను సులువుగాఁ దెలిసికొనవచ్చును. ఈ పుష్పమునందు దళములైనను ప్రత్యేక ప్రత్యేకముగా నున్నను, అడుగున కేసరపు గొట్టముతోఁ జేరియుండును. ఇట్లు చేరియుండు

విధంబు 78-వ పటమునఁ జక్కఁగాఁ జూపఁబడియున్నది. మధ్య భాగంబున కీలమును, కేసరపుగొట్టమును, దీనికిఱువైపుల దళముల మడుపులును గానఁబడును. వెలుపటఁ దెల్లగాఁ గనఁబడు గీతయె దళ చుట్టుయొక్క కోఁతయంచు. ఇది లోపల నండాశమును జేర్చుకొనియున్న కేసరపుగొట్టముయొక్క క్రిందిభాగముతోఁ జేరియుండుటను జూడుఁడీ. దళంబులైదును బుష్పకోశపుగిన్నెయొక్క యయిదు చీలికలకు సూటిగా నుండక, ప్రక్కప్రక్కగా నుండును. అనఁగా, దళములు చేరియుండు స్థలము పుష్పకోశపు చీలికలకు రెండింటికి నడుమను, పుష్పకోశపు చీలిక కిరుప్రక్కల రెండుదళములును నుండును. గంగరావి మొగ్గను రెండుచోట్లను అనఁగా అడుగునను, కొనను నడిమికిఁ గోసి చూచినయెడల, దళములును పుష్పకోశపు చీలికలును నొకటివెంబడి మఱియొకటి వచ్చుట చక్కఁగాఁ దెలియును. ఇది 79-వ పటమునందుఁ జూపఁబడియున్నది.

గంగరావిపూవులలో కేసరములు గొట్టములై తమ లోపల నండకోశము నుంచుకొనియున్నవి యని ముందె చెప్పఁబడినది. అండాశయము కేసరపు గొట్టము నడుగున వెడల్పుగా నుండుభాగమునందున్నది. కేసరపు గొట్టమున నూలిపోఁగువలె నుండునట్టి వస్తువే కీలము. కీలముయొక్క కొనయందుండు

లావుగల భాగము కీలాగ్రమనఁ బడును. కీలాగ్ర మైదు మిట్ట ప్రదేశములును నైదు పల్లపు ప్రదేశములును గలిగియుండును. అండాశయమునం దైదు గదులు గలవు.




78-వ పటము.—గంగరావి మొగ్గయొక్క నిడివి చీలిక.



79-వ పటము.—గంగరావి పుష్పాలభాగము లమరియుండురీతి.

బయట నల్లగా గానబడు చుట్టు పుష్పకోశము. రెండవ చుట్టు దళంబులు. మూడవ చుట్టు కేసరంబుల గొట్టము. మధ్యనుండునది యండాశయము.

అండాశయముయొక్క నడుమ నండకోశపు గదులు చేరుటవలనఁ గలిగెడు మాధ్య స్తంభమునం దండము లంటుకొని యుండును.

మిక్కిలి లేఁతదయిన యండాశయమునందె యయిదర











80-వ పటము.—గంగరావి యండాశయము. దానియడ్డపు చీలికయు.

లుండును. ఇవి పెద్దవిగాను గాను నొక్కొక్కగదియు రెండుగా భాగింపఁబడును. అయినను, ఈ విభాగము గదిలో కొంతభాగమునకే, యంతకును లేదు. కాఁబట్టి గదులయిదే యున్నవని చెప్పవచ్చును.

దాసాని, బెండ, ప్రత్తి మొదలగు పువ్వులలో పుష్పకోశపు చీలికలును, దళములును వెంబడి వెంబడిగా నుండును. కేసరపు గొట్టములును గంగరావి పూవులలో నుండునట్లె, ఈపూవులలో నున్నవి. అండకోశమునందు మాత్రము వ్యత్యాసము గలదు. దాసానిపువ్వుయొక్క కీలముకొనయందు నైదు చీలికలుగల కీలాగ్రముండును. ప్రత్తిపూవు నండాశయమునందు మూఁడుగదులును, మూఁడు కీలాగ్రములును మాత్రమె యుండును. బెండపూవుయొక్క యండాశయమునందు గదులును కీలాగ్రములును క్రమక్రమముగా నైదేసి యయినను, నంత కంటెఁ బైఁబడియైనను నుండును.

పొన్న, అవిసె, ఉమ్మెత్త వీని పువ్వులందును నైదు దళములును, నయిదు వెలిదళములును ప్రక్క ప్రక్కననే యుండును. ఉమ్మెత్త పువ్వుయొక్క కేసరములు దళచుట్టు యొక్క చీలికల కెదురెదురుగా నున్నవి. పొన్న, యవిసె యీ రెండు పూవులును నొక్కొక్క గదియెగలవి. కీలాగ్రము గూడ నొక్కటియె. ఉమ్మెత్త పూవునందున్నట్టి యండాశయము రెండు గదులును, కీలాగ్రము రెండు రెమ్మలును గలిగి యున్నవి.

ఇంచుమించుగా నన్ని పుష్పములలోను నొక చుట్టులోనివి మఱియొక్క చుట్టులో నుండువాని కెదురెదురుగా నుండక ప్రక్కప్రక్కన నుండును. వెలిదళములైనను పుష్పకోశపు చీలికలైనను దళములకు ప్రక్క ప్రక్కన నుండును. దళములు, పుష్పకోశపు చీలికలు నెన్ని యున్నవో, అన్నియె కేసరము లున్నయెడల, నీ కేసరములు దళములకు ప్రక్కనను, వెలి దళములకు గాని, పుష్పకోశపు చీలికలకు గాని యెదురెదురుగాను నుండును. కేసరములు దళములకంటెను పుష్పకోశపు చీలికలకంటెను రెట్టింతలుగా నై యున్నయెడల, మొదటి వరుస పుష్పకోశపు చీలికలకు నైనను వెలిదళములకు నైనను నెదురుగాను, రెండవ వరుస దళములకు నెదురుగాను నుండుట వాడుక.

పుష్పకోశము, దాని యుపయోగము:—పువ్వులన్ని యుఁ బుష్పకోశములు గలవి. మొగ్గలందుఁ బుష్ప కోశమునకు,



81-వ పటము.—బుడ్డ బూసర కాయ.

దళ, కేసర, అండకోశములను బాగుగాఁ గప్పుకొని కాపాడుట యె ప్రధానకార్యము. దీని నిమిత్తమె పుష్పకోశము పుష్పము నందలి యితరములైన భాగములకంటె శీఘ్రముగాఁ బెరిగి, పెద్ది దియగుచున్నది. తంగెడు, తామర, అల్లి మొదలగు పువ్వులంద వలె నీ భాగము ప్రత్యేకప్రత్యేకములైన వెలిదళములు గలది

గానైనను, ఉమ్మెత్త, అవిసె పువ్వులందువలె నొకటిగాఁ జేరి నదిగానైనను ననేకవిధ రూపంబులను బొందియుండుట వాడుక. అది చేరియుండు తావును గమనించి చూచినయెడ, రెండు విధములుండునట్లు తెలియును. పుష్పకోశ మండాశయమునకుఁ గ్రిందనైనను, లేక దానికి మీఁదనైనను నుండును. గంగరావి, అవిసె, ఉమ్మెత్త వీని పువ్వులం దండాశయమునకుఁ గ్రిందఁ బుష్పకోశము చేరియున్నది. అనఁగా పుష్పకోశము "నీచము." అండాశయము "ఉచ్చము." కాఁకర, గుమ్మడి, మడ్డి మొదలగు పువ్వులం దండాశయమునొక్క పై భాగమునఁ బుష్పకోశముండుటవలన వీనిలో నండాశయము "నీచము." పుష్పకోశము "ఉచ్చము."

పుష్పములందు సాధారణముగా పిందెలు పుట్టఁగానే పుష్పకోశము లెండిపోవును. కొన్నిటిలో నిది కాయలు ముదిరి పండ్లగు నంతవఱకు నుండును. ఉదాహరణముగా వంగ, బుడ్డబూసర (81-వ పటము.) కాయలను బరీక్షింప వచ్చును. పుష్పకోశములేని కొన్ని పువ్వులును గలవు. వీనికి దృష్టాంతము:— చేమ, కంద, ప్రొద్దుతిరుగుడు పువ్వు, వీనివంటివి.

దళములు, వాని యుపయోగము:—పుష్పమునందుండు భాగములలోఁ జూపున కందమైన భాగము దళములే. పుష్పకో

శమువలె దళచుట్టు వేఱువేఱు దళములు గలదిగా నైనను నొకటిగాఁ గూడిన దళములు గలదిగా నైనను నుండును. దళచుట్టు ఏకాకారముగా నున్నయెడల, నది వివిధ రూపము లను బొందియుండును. ఉమ్మెత్త, ప్రబ్బలి యీ పుష్పముల దళ చుట్టు గొట్టములు "ఫౌన్నల్" అని చెప్పఁబడు పోఁత గొట్ట ములవలె నుండును. వంగ పువ్వుయొక్క దళచుట్టు చక్రా కారముగ నుండును. తురక మల్లె పువ్వునందు దళచుట్టు కొనభాగమునందు వెడల్పయి తట్టవలె నుండును. పుష్పకోశము వలెనె దళచుట్టును పుష్పములోని యంతరంగముల నావ రించుకొని; యవి పక్వములగువఱకు వానినిఁ గాపాడును. మఱియు దళములకుఁగల పరిమళమును, నందమును శలభ పతం గాది కీటకములనుదమవద్ద కాకర్షించు నిమిత్తమె యేర్పడియు న్నవి. కొన్ని చెట్లయందీపువ్వుల కేర్పడిన కృత్యమును జేయుట కై యీ పుష్పములలో తుమ్మెదలు, పతంగాదులు సంచరించు ట యావశ్యకము. దీనికిఁ గారణము పై యధ్యాయమునందుఁ దెలుపఁబడును.

కొన్ని పుష్పములలో దళములకు పుచ్ఛము లుండుట గలదు. గన్నేరు, కొండిసెపాల, తెల్లపాల వీని పువ్వుల దళములకుఁ

బుచ్ఛము లున్నవి. కొన్ని పుష్పములలో దళములే లేవు. ఉదాహరణము-బాదము, కరక, భద్రాక్షి (చంద్రకాంత) పూవులు.

మొగ్గలందు దళములును, వెలిదళములును బలుతెఱంగులుగ మడువఁబడి యుండును. కొన్ని పుష్పములలో దళములొకదాని లోపల నొకటి యడఁగియుండును. ఇట్లుండుటను పొన్న, రేల, తంగేడు, అవిసె వీని పూలయందుఁ జూడవచ్చును. గంగరావి మొగ్గలందు దళముల యొక్క ముందటి యంచులు ముందుండు దళములయొక్క వెనుకటియంచునకు మీఁదుగాను, వెనుకటి యంచు వెనుకటి దళములయొక్క ముందటియంచునకు దిగువఁగాను నుండును. జిల్లేడు పూవునందు దళముల యంచులు మాత్రమె చేరియుండును.













82-వ పటము.—తెల్లపాల.

1. పుష్పముల ద్విసృంత మధ్యారంభి మంజరి. (పూవులదళములందు పుచ్ఛములుండుటను జూడుఁడీ).2,3. కేసరములు. 4. అండకోశము.

కేసరములు, వాని యుపయోగము:—ముందు చెప్పిన ప్రకారము కేసరములన్ననో దళములతోను, పుష్పకోశపు చీలికలతోను, లేక వెలిదళములతోను సమాన సంఖ్య గలవిగానైనను, రెట్టింపుగానైనను, అంతకంటె నెక్కువగానైనను నుండును. గంగరావి, బెండ, పొన్న వీని




83-వ పటము.—వంగ పువ్వు, దాని భాగములు.

1. పువ్వు. 2. దళచుట్టును, కేసరములు. 3. పుష్పకోశము, అండకోశము. 4. కేసరము.

పుష్పములవంటి పుష్పములందుఁ గేసరంబులు మెండుగా గలవు. ఉమ్మెత్త, వంగ, మిరప, గన్నేరు వీని పుష్పములందు గేసరంబులును, వెలిదళములును నైదేసియె యుండును. మఱియు నొకచుట్టులోనివి మఱియొక చుట్టులోని వానికెదు

రేదురై యుండక ప్రక్క ప్రక్కననె యుండును. అవిసె, రేల, తంగేడు, పల్లేరుపువ్వులందు పది కేసరము లుండును.

దళములకంటెను, వెలిదళములకంటెను గేసరములు తక్కువగా నుండుటకూడ కలదు. ఉదాహరణముగ నూవు, తుమ్మి, వావిలి, తులసి, మల్లె వీని కేసరంబులు దళములకును వెలిదళములకును తక్కువగానుండును.

కేసరములయొక్క భాగములు మకరందపుతిత్తియు, దానిని మోసికొనియుండు కాడయును. ఈ కేసరపుకాడలు పెక్కుపువ్వులందు వేర్వేఱుగా నున్నను, గొన్నిటిలో మాత్రము చేరియుండుటయుం గలదు. చిక్కుడు, అవిసె, వేమువీని కేసరపు కాడలు చేరి గొట్టమువలె నున్నవి. కొన్నివృక్షముల పువ్వులలో నీకాడలు చేరక, వేర్వేఱుగా నుండి, కొన్ని మకరందపు తిత్తులు మాత్రము చేరియుండుటను మనము చూడవచ్చును. ఇట్టి యునికిని బంతివంటి పుష్పమంజరులయందలి పుష్పములందుం బరీక్షింపవలెను.

కేసరము లితరాంగములవలెనె కాడయొక్క కొనయందైనను, పుష్పకోశమునందైనను, నండాశయము మీఁదనైనను, దళములయందైనను జేరియుండును. గంగరావి, బెండ,

పొన్న వీనియందలి కేసరము లండాశయమునకుఁ గ్రిందుగా వృంతమునందుఁ జేరియున్నవి.

పుష్పముయొక్క మూడవచుట్టగు నీ భాగము పుష్ప కోశముతోఁ జేరియుండుటను అవిసె, తంగేడు వీని పువ్వుల లోఁ జూడవచ్చును. వంగ, ఉమ్మెత్త వీని పువ్వులందలి కేసర ములు దళచుట్టుతోఁ జేరియున్నవని ముందె చెప్పఁబడెను గదా. దానిమ్మ, నేరేడు వీని పువ్వు లందలి కేసరము లండాశయము యొక్క యుపరిభాగమునఁ జేరియున్నవి.

కేసరములును నండకోశమును పుష్పముయొక్క ప్రధా నభాగములు. పుష్పకోశము, దళచుట్టునను నీ రెంటియొక్క ముఖ్యకార్యము తమలోపలనుండు ప్రధానాంగములను నావ రించికొని కాపాడుటయు, కీటకాదులను పుష్పములలోనికి నా కర్షింపఁజేయుటయునై యున్నది.

అండకోశము, దానికార్యము:—పుష్పముయొక్క నా లవచుట్టయి, నడుమనుండు నండకోశము పుష్పమునందలి ప్రధా నాంగములలో నొక్కటి. కీలము, కీలాగ్రము, అండాశయము అను మూడును దీని భాగములు. కీలము తెలుపుగా నె తెల్లని నూలిపోఁగువలె నుండును. కొన్నిపుష్పములందు దీ కొన చీలియుండుట కలదు. చీలనికీలములో కీలాగ్రము బల్ల

శాఖగాను, చీలిన కీలములోని కీలాగ్రము కీలముయొక్క చీలికలకు సమమయిన సంఖ్యగలదిగాను నుండును.

అవిసె, తంగెడుపూవులవంటి పూవులం దండాశయము ఒక గదిగలదిగానైనను, వంగ, గంగరావి, ఉమ్మెత్తపువ్వులం దండాశయము పలుగదులు గలదిగానైనను నుండును. ఒకగది గలదానిని "సామాన్యాండాశయ" మనియు, పలుగదులుగల దానిని "మిశ్రాండాశయ" మనియుఁ జెప్పఁదగును. ఈ మిశ్రాండాశయ మిఱుతెఱంగులు గలది. వానిలో నొక్కటి కలిసిన గదులుగలది. మఱియొక్కటి విడివిడిగానుండు గదులుగలది. మొదటిదానిని "సంయుక్తాండాశయము" అనియు, (ఉదా. గంగరావి, బెండ.) రెండవ దానిని "విభక్తాండాశయము" అనియుఁ జెప్పవచ్చును. ఉదాహరణముగ అశోక, తామరపువ్వుల యండాశయములను జెప్పవచ్చును.

అండకోశము గంగరావి, బెండ మొదలయిన పువ్వుల యందువలె నుచ్చముగాఁగాని, మడ్డి, గుమ్మడి పూవులందుఁ బోలె నీచముగాఁగాని యుండవచ్చును. సంయుక్తాండాశయములందు తఱుచుగాఁ బెక్కుగదులు గలవు. అయితే, సంయుక్తాండకోశములలోఁ గొన్నిటియందును సామాన్యాండకోశముల యందు వలె నొకగదియే యుండును. ఉదాహరణముగా గుమ్మ



84-వ పటము.—అండాశయ మధ్యస్తంభ సంయోగము.

డి, కాంకర, పొన్న, బొడ్డుపావలికూర వీనియొక్క యండాశయంబులం జెప్పవచ్చును. అండములను వహించుచు వానిని గాపాడుటయే యండాశయముయొక్క పని. అండాశయమందు నండములు చేరియుండు చోటిని "అండలంబనస్థానము" లేక "అండసంయోగస్థాన" మని చెప్పెదము. అండముల చేరిక మూడు తెగలు. అవి యేవనఁగా నండాశయము యొక్క మధ్యస్తంభముతో చేరిక. (ఉదాహరణము—గంగరావి, బెండ, ఉమ్మెత్త) అండాశయకుడ్యముతో చేరిక. (ఉదాహరణము—గుమ్మడి, అవిసె.) అండాశయపీఠముతో చేరిక. (ఉదాహరణము—తోటకూర, బొడ్డుపావలికూర.)

ఇదివరలో మనము పరీక్షించిన పుష్పములలో ననేక భాగంబు లున్నవి. పలు పుష్పములలో నీ భాగంబులు తక్కువగా నైన నుండుట కలదు. అన్ని భాగంబులు లెక్కలో సమముగాఁ గలదానికి నుదాహరణంబుగా పల్లేరు పువ్వును జెప్పవచ్చును. ఉమ్మెత్త, వంగ మొదలైన వాని పువ్వులయందు



85-వ పటము.—అండాశయ సుధ్య సంయోగము.



86-వ పటము.—అండాశయ పీఠ సంయోగము.

నాలవ చుట్టగు కేసరములు తప్పఁ దక్కిన భాగములు సమాన సంఖ్య గలవిగా నుండును. గంగరావి పువ్వులందు దళములు, పుష్పకోశపు చీలికలు, అండకోశపు గదులు ఇవి మాత్రము లెక్కలో సరిగా నుండును. కేసరపు గొట్టములు, మకరందపు త్తు లెచ్చు తక్కువగా నుండును.

దళములు, వెలిదళములు లేని పుష్పములు గలవని పూర్వ మె చెప్పఁబడెనుగదా. పుష్పములలోఁ గొన్నిటియందు కేసరం ులు లేక యండకోశముమాత్ర ముండుటయు, మఱి కొన్నిటి యందు అండకోశము లేక కేసరములు మాత్రముండుటయు స్వాభావికము. ఆనుదపుచెట్టు, కుప్పింట, కాఁకర, గుమ్మడి

పువ్వులందు కేసర మయినను, అండకోశము మాత్ర మయినను, తఱుచుగా నుండునుగాని, ఒకటె పుష్పమునందు రెండు భాగ ములును జేరియుండుట యరుదు.




87-వ పటము.—కుప్పెంట.
(ద్విలింగ వృక్షము.)

1. మండ. 2. కంకి (ఎన్ను). దీని యందు పైననుండునవి మగ పువ్వులు. క్రిందనుండునవి యాఁడు పువ్వులు. 3. ఆఁడు పువ్వులు, కాయల నఱుకుల ముఖ ములు.




88-వ పటము.—ఆముదపుచెట్టు
(ద్విలింగ వృక్షము.)

1. పూల కంకి (ఎన్ను 2. మగ పువ్వు. 3. ఆఁడు పువ్వు. 4. కాయ నఱుకు ముఖములు.

అండాశయము గల పుష్పమునందె ఫలమును బీజమును



89-వ పటము.—దొండ.
1. ఆడు పువ్వు. 2. మగ పువ్వు.

గలుగుటంబట్టి యీ పుష్పమును స్త్రీ పుష్పమనియు, అండాశయ రహితమై, కేసరములు మాత్రముండు పుష్పమును పురుషపుష్పమనియుఁ జెప్పుటవాడుక. ఆముదపుచెట్టు, గుమ్మడి, కాఁకర, కుప్పెంట, ఈ చెట్లలో స్త్రీ పురుషజాతులు గల పుష్పములు వేలువేలుగా నున్నను, ఒకేచెట్టునందే యిరుతెఱఁగుల పుష్పములు నుండును. ఈ జాతిచెట్లను "ద్విలింగ వృక్షము" లని చెప్పవచ్చును. దొండ తీఁగలలో నొకదానియందు మగపువ్వును, మఱియొక దానిలో నాఁడు పువ్వును గలుగుచున్నవి. వీనివంటివి "ఏకలింగ వృక్షము" లనఁబడును. గంగరావి, దానాని, అవిసె మొదలైనవాని యం దండకోశమును, కేసరములును నొక పుష్పము




90-వ పటము.—దొండ.

1. ఆఁడు పువ్వు. 2. మగ పువ్వు. 3. కీలాగ్రము. 4. కేసరము.

నందె యుండును. ఇట్టివి "మిథున పుష్పము" లని చెప్పఁ దగి యున్నవి.

---

## 8-వ అధ్యాయము.

### మకరంద రజస్పర్శమును, గర్భధారణమును.

స్త్రీ పుష్పము తప్ప తక్కిన పుష్పములన్నియుఁ గేసరములు గలిగియుండుట స్వభావము. పుష్పములయందలి కార్య





91-వ పటము.—గంగరావి మకరందపు తిత్తులు. (పైననుండు తిత్తి మొగ్గలోనిది. క్రిందనుండు తిత్తి పువ్వులోనిది.)

ములకుఁ గావలసిన ముఖ్యమయిన యవయవములు కేసరంబులును నండకోశమును. కేసరములయొక్క సహాయములేక అండాశయమునందలి యండములు బీజములుగాఁ బరిణమింపవు. జంతువులలో పురుషసాహాయ్యములేక స్త్రీ జాతికి గర్భధారణ ఎటుల సంభవింపదో అట్లె పుష్పములయందును అండాశయమునకు కేసరముల సాహాయ్యములేక బీజములు జనింప నేరవు. ఈ కారణముంబట్టియే కేసరములను పుష్పములయొక్క పురుషాంగములని చెప్పుట. కేసరములయొక్క ప్రధాన భాగములు మకరందపు తిత్తులు. గంగరావి పువ్వునందు కేసరపు గొట్టముయొక్క వెలిపార్శ్వములోనున్న పసుపు రంగుగల చిన్న యుంటలే మకరందపు తిత్తులు. ఇవి పటమునందుఁ జూపియుండులాగున వాలి, యొక్క ఱేగది గలిగియున్నవి. ఈ గది మొగ్గలలోఁజీలక, పువ్వులయందు మాత్రము చీలియుండును. తిత్తియొక్క లోపలను బైటను జిన్నచిన్న రేణువులు మెండుగాఁ గనఁబడును. ఈ రేణువునే పుప్పొడి యనియు, మకరంద ధూళియనియును జెప్పుచున్నాము. మకరందపు తిత్తి

యొక్క పని మకరంద ధూళిని గలుగఁజేసి, యది పక్వమై వెలువడు పర్యంతము దానినిఁ గాపాడుటయే.

ఈ పొప్పుడిని భూతద్దముతోఁ జూచిన నది చిన్న చిన్న రేణువులుగాఁగనఁబడును. గంగరావి పువ్వులోనుండు మకరంద రేణువులు 92,93. వ పటములలో మిక్కిలి పెద్దవిగాఁ జూపఁబడి యున్నవి. మకరంద రేణువు లొక్కొక్కటియు జీవాణువులతో నిండిన కణములు. ఈ చిన్న కణముల నావరించి యుండెడి యొరకు వెలుపటి పార్శ్వము మిగుల సన్న ముండ్లతోఁ గూడి యుండును.



92-వ పటము.—గంగరావి మకరంద రేణువులు. (ఇచ్చటఁ గనఁబడుచిన వానిలో రెండు మకరంద తిత్తుల నుండి జీవాణువు గొట్టరూపమున బయటికి వచ్చియున్నది.)

గంగరావి కుటుంబమునఁ జేరిన దానాన్ని బెండ, ప్రత్తి, తుత్తిరి మున్నగు చెట్లలో నన్నిటియందును మకరందపు తిత్తి గంగరావి పువ్వునందుండు దానివలె నొకటే గది గలిగియుండును అయినను, ఈ పువ్వులన్నియు మొగ్గలుగా నుండునపుడు మకరందపు తిత్తిలో రెండు గదు లుండును. మొగ్గలు ముదిరిన తోడనె యివి రెండును నొక్కటిగాఁ గలియును. కావున వికసించు పూవుల మకరందపు తిత్తిలో గది యొక్కటె కనఁబడును. సాధా

రణముగా గంగరావి కుటుంబములోఁ జేరిన వాని పుష్ప కేసరం బులందుఁ దప్పఁ దక్కినవాని పుష్పములందలి కేసరంబులలో




93-వ పటము.—గంగరావి మకరందరేణువులు.

రెండు మకరందపు తిత్తులు పుట్టి పెరుగుట స్వాభావికము. ఒక్కొక్క తిత్తిలోను రెండు గదు లుండును. మొగ్గలయందలి మకరందపు తిత్తులలో నీ నాలుగు గదులు చక్కఁగాఁ గనఁబడును. మొగ్గలు ముదురఁగానే మకరందపు తిత్తిలో నుండు రెండు గదులు నొకటి యగును. ఈ విషయము లన్నియు 94-వ పటమును జూచినఁ దెలియును. మకరందపు తిత్తులు కేసరపు కాడలయొక్క కొనలం దమర్పఁబడి యుండును. కొన్ని కేసరముల కాడలు మకరందపు తిత్తులకుఁ బైకిఁ బోయి, పొడవుగా నుండుటయుఁ గలదు. (97-వ పటమును జూడుఁడు.)

ఉమ్మెత్త, బెండ, గంగరావి, అవిసె వీనిలో నొక్కొక్క మకరందపు తిత్తిలో నుండు రెండు గదులు నొకటియైన పిదప, వానినడుమ సూటిగా నొక చార యేర్పడి, దానినుండి పుష్పధూళి వెలుపలికి వచ్చుచుండును.

వంగ, తంగెడు వీనిలో నుండు మకరందపుతిత్తుల కొనలయందుండు సందులనుండి పుప్పొడి బయలువెడలుట సహజము. మఱికొన్నిటియందు మకరందపు తిత్తులలో నుండు చిన్న మూఁతలు పైకిఁ దెఱచుకొనుటచే నేర్పడు సందులనుండి యీ




94-వ పటము,—ఉమ్మెత్తపువ్వుయొక్క కేసరములు.

1. ఎదుటి చూపు. 2. ప్రక్క చూపు. 3. వెనుకటి చూపు. 4. మకరందపు తిత్తియొక్క యడ్డపు నఱుకుడు చూపు. 5. మకరంద రేణువు.

మకరందరజము బయలువెడలుట గలదు. ఈ భేదములన్నియు 94-98-వ పటములందుఁ జూపఁబడియున్నవి. మకరంద రేణువు

కీలాగ్రమునఁ బడినతోడనే యది పెరుగ నారంభించును. కీలా



95-వ పటము.— విడివిడిచీలికగల మకరందపుతిత్తి.



96-వ పటము.— కోసగ్గో సందులుగల మకరందపుతిత్తి.





97-వ పటము.— మకరందపు తిత్తుల మీఁదికిఁ బోయియుండు నడిమి కాడలుగల కేసరములు.

గ్రము పై భాగమున మిక్కిలి మెత్తనిరోమములు దట్టముగా నుండుటయు, దానియందే యొకజిగటవస్తువు కలుగుటయు,

మకరందపు తునుకలు దానిమీఁద నంటుకొనుటకు సహాయ మగును. అండాశయములోనుండు నండములు పక్వమై గర్భధారణమునకుఁ దగినవైనపుడు, కీలాగ్రమందుండి యీ జిగట విశేషముగాఁ గలుగును. రోమములును దట్టముగాఁ బెరిగి నిక్కికొని యుండును. మకరందరేణువునకుఁ కీలాగ్రసంబంధము కలుగఁగానే యచ్చట జిగట వస్తువుండిన పక్షమున, నా మకరందరేణువు పొరచీలి, దానిలోపలనుండుజీవాణువుగొట్టమురూపమున బయలుపడును. పిమ్మట నీ జీవాణువుగొట్టము కీలాగ్రమును దొలఁచుకొని పెరుగుచుఁబోయి యండాశయములోపలికిఁ జొచ్చి యండములను దాఁకును. (99-వ పటమును జూడుఁడు.)



98-వ పటము.—మూఁతలుగల మకరందపుతిత్తులకేసరములు.

అండాశయములో నుండు నండములకును కీలాగ్రమునకును మిగుల దూరముగలదు. మకరందపు తునుకలు సూక్ష్మము లైనందున, దానిలోపల నుండు జీవాణువు మఱి సూక్ష్మముగా నుండును. దీనింబట్టి జీవాణువు యొ



కు గొట్టమును సన్నగానే యుండును. కావున నీ గొట్టము బహుదూరమునకు నావలనుండు నండముల నెట్లు సమీపింపఁగలదను ప్రశ్నకు నది కీలాగ్రమును దొలఁచుకొని పోయి కీలములోని సూక్ష్మకణముల యందుండెడు జీవాణువును నాహారంబుగాఁ గైకొని వర్ధిల్లి నిడివియగుచున్నదనుటయే తగినయుత్తరము.

అండకోశము పుష్ప

99-వ పటము.—మకరందరేణు స్పర్శమును, గర్భధారణరీతియు.

(కీలాగ్రమునందుండు మకరందరేణువులు నాలుగింటిలో మూడు గొట్టములుగలవైయున్నవి. ఒకదాని గొట్టముమాత్రము లోనికిఁ జొచ్చి, పిండాశయమును సమీపించియున్నది.) 1. 2. అని గుఱుతుపెట్టియుండు భాగము లండత్వక్కులు. వీనియందు లోపల నడంగియుండు భాగమే యండప్రధానము. అండప్రధానములోఁ బెద్దదిగా నగుపడుకణమే పిండాశయము. 1. 2. అని గుర్తించిన భాగంబులకు నడుమనున్న మకరందపు గొట్టము దూరెడు సందె యండ వివరము.

ముయొక్క స్త్రీభాగంబని పూర్వమే చెప్పఁబడినది. దీనిలోని భాగమగు కీలము కొన్నిపుష్పములలో లేకుండుటయుఁ గలదు. కీలాగ్రంబు మాత్రము అండకోశముల కన్నిటికి నుండును, ఇది కీలముయొక్క కొనలయందైనను, అండాశయము మీఁదనైనను గనఁబడును. కుప్పెంట, ఆముదపుచెట్టు వీని కీలములు మిగుల కుఱుచనివి. వీని యండాశయముమీఁదఁ జీలి యుండు మూఁడు పోగులును కీలపురేఖలే. వీనినే కీలాగ్రములుగాఁ దలఁపవలయును. పుప్పొడి గాలిచేఁ గొట్టుకొని పోకుండునట్లు తనయందే నిలుపుకొని, దాని రేణువులను బెరుగునట్లు చేయుటయే కీలాగ్రముయొక్కపని.

అండాశయము అండముల వహించుటకును, గర్భధారణకుఁ బిదప, అవి విత్తులగువఱకుఁ గాపాడి, పిమ్మట నా విత్తులను బయలుపఱుపను నేర్పడిన యొక యవయవము. అండమనునది కణముల సమూహమె. ఇది పక్వమై గర్భధారణమునకు సిద్ధముగానుండు తరుణమున దీనిలోఁ గొన్నియంగంబు లేర్పడియుండును. ఇట్టిసమయంబున నండము అంతఃప్రధానభాగముగాను, అండత్వక్కుగాను భాగింపఁబడి యుండును. అండత్వక్కులు రెండు గలవు. ఈ త్వక్కులు రెండును అండప్రధానభాగమునన్ని ప్రక్కలను బాగుగా నావరించుకొని యుండును. ఒక

ప్రక్క మాత్రము ఒక చిన్నద్వార ముండును. ఈ ద్వారము «అండవివరము» అనఁబడును.

అండ ప్రధానముయొక్క కణములలో నొకటిమాత్రము పెరిగి, తక్కిన వానికంటె మిగుల పెద్దదిగా నుండును. ఇదియె పిండాశయమగును. పిండాశయమునం దండ వివరమునకుఁ బ్రక్కన మూఁడు జీవ పరమాణువు లుండును. వీనికి సూటిగాఁ బిండాశయమునందుఁ గ్రిందిప్రక్క మూఁడు జీవపరమాణువు లుండును. ఈ రెండు జీవపరమాణువుల గుంపునకును మధ్య నొక జీవ పరమాణువు నిలుచును. ఇట్లు పిండాశయము నందు మొత్తమున నేఁడు జీవపరమాణువు లుండును. అండ ప్రధాన మందుండు పిండాశయములో నండ వివరమునకు సమీపమున మూఁడు జీవపరమాణువు లున్నయెడల నదియె గర్భధారణకు అండము సిద్ధముగా నుండుటకు గుఱుతుగా నుండును. ఈ తరు ణముననే కీలాగ్రము జిగట గలదిగా నుండును. ఈ సమయ మందే మకరంద రేణువులు కీలాగ్రమందు మొలచును. ఆ మ రంద రేణువుల గొట్టము కీలముగుండా అండవివరములోఁ ప్రవేశింపఁగా, దానికి చేరువ నున్న పిండకోశపు జీవపర మాణువులలో లోపలి చిన్నదానితో మకరంద రేణు గొ మందలి జీవపరమాణువు గలియును. ఇట్లే రెండును

గలిసి యొకటియై జీవ పరమాణువు నొంట యగును. ఇదియే పుష్పములలో గర్భధారణ మనఁ బడుట. (99-వ పటమును జూడుఁడు.)

గర్భధారణము వలనఁ గలిగిన యీ జీవ పరమాణువు వర్ధిల్లి విభజన పొంద నారంభింపఁగానే, యందు కణములు మెండుగాఁ గాన్పించును. ఈ కణములు పిండాశయమునందు మొలకలుగ మారును. మొలకలు పెనుగను పెరుగను, పిండాశయము నావరించియుండు నండ ప్రధానము నందలి కణములు నశించుటతోడ పిండాశయము వృద్ధినొందుచు వచ్చును. అండ త్వక్కులుసైతము వర్ధిల్ల నారంభించును. సన్నని మొలకలతో నిండిన పిండాశయమును, దానిని గ్రమ్ముకొని యుండెడి యండత్వక్కులును జేరి విత్తన మనఁబడును.

గర్భధారణకు పుష్పోడి నొక్క రేకుపు ముఖ్యము గావున నందలి రేణువులు కీలాగ్రంబుపైఁ బడుటకు సాధనము లుండ వలయును. మిథున పుష్పంబుల లోపల కేసరంబులున నండకోశంబును నొకే పువ్వునం దుండుటచేత కీలాగ్రము నందు మకరంద రేణువులు తమంతటనే పడవచ్చునుగదా! ఏకలింగ ద్విలింగ వృక్షముల యందు ఆఁడు పువ్వులు, మగపువ్వులు వెవ్వేరుగా నుండుటంబట్టి, మకరంద రేణువులు కీల

గ్రంబును జెందుటకు సాధనము లెవ్వియైన నుండవలయును. మకరందపు పొడి వాయువు వీచుటవలన కీలాగ్రంబును బొందుట గలదు. మొగలి, పచ్చిక యీ జాతిలోఁ జేరినవి దీనికి దృష్టాంతముగాఁ జెప్పవచ్చును. గాలి వీచుటవలన మకరంద స్పర్శమై గర్భధారణము పొందెడి పుష్పములు అందము, సువాసన, వర్ణములేక యాకారమునందు సన్నవిగా నుండును. మకరందపు పొడి మాత్రము మిక్కుటముగాఁ గలుగును. ఏలయన మకరందపు పొడి కొంచెముగా నున్నయెడల, గాలి వీచునపుడు చెదరి కీలాగ్రమును జెందక పోయినను బోవచ్చును. అది యధికముగాఁ గలిగిన యెడలఁ బలుమాఱు గాలి వీచునపుడు, మకరందపు పొడి లేచి చెదరును. దీనివలన మకరంద రేణువులలోఁ గొన్ని యయినను కీలాగ్రంబును బొందకపోవు. ఇట్టి చెట్లయందు మకరంద రేణువులు తేలికగా నుండును. మొగలి పువ్వులలో నుండి క్రిందరాలెడు పొడి మకరందపు పొడియే.

మఱికొన్ని చెట్ల పుష్పముల గర్భధారణము తేనెటీఁగ, చాకలిపురుగు మొదలయినవి మకరందపు పొడిని కీలాగ్రంబునందుఁ జనుమటవలన నగును. ఈలాటి చెట్లయొక్క పుష్పంబులు ప్రకాశమానములై, రంగులుగలిగి, పరిమళవంతములుగ

నుండును. తేనె మొదలయిన తియ్యని వస్తువు లీ పుష్పంబు నందుఁ గలుగును. పుష్పము లందమై, వన్నెకలిగి యుండు టయు వాసన గొట్టుటయు తుమ్మెదలు మొదలయినవి వాని మీఁదికి వచ్చుటకే కారణమగుచున్నవి.

తెల్లని రేకులు, పసుపు పచ్చని రేకులుగల పూలమీఁదఁ జిన్న కీటకాదులును, ఈఁగలును తఱుచుగా వాలును. ఈ పువ్వులు సువాసనలేక దుర్గంధము గొట్టుటయుఁ గలదు. నిడుపు నాలుకగల తేనెటీఁగలు, చాకలి పురుగులు ఇవి నీలవర్ణము, ఎఱ్ఱని వర్ణముగల పూలమీఁద విశేషముగా వాలును. ఈ పువ్వులలో సువాసనయే యుండుట స్వాభావికము.

పుష్పములయందు కీటకములు వాలిన తోడనే యవి తేనెయుండు తావును వెదక నారంభించును. ఈలాగు తిరుగు నప్పుడైనను తేనెను పానముచేయు నప్పుడైనను మకరందపు తిత్తు లీ కీటకముల యొడలికిఁ దగులుటచేత, నచ్చటనుండు మకరంద రేణువులు వీనియొడలి కంటుకొనును. పురుగులు తేనెను వెదకు నప్పుడైనను కేసరంబులును కీలాగ్రంబులును, వాని యొడలి కొరుచుకొనునట్లు పువ్వులయునికి యేర్పడియుండును. కేసరములు గాని, కీలాగ్రములుకాని, తమయొంటికిఁ దగుల నీయక తేనెయుండు తావునకుఁ బోవుట కీటకముల కసాధ్యము గదా! ఇదియును గాక, యొక్కొక పుష్పమునం దొక తెగ

కీటకమే వాలును. వాసనకుగా వాలునవి తప్పఁ దక్కిన కీటకములు మకరంద పానము చేయవచ్చినను, వాని కట్టి పుష్పములలో తేనె దొరకుట యసాధ్యము.

కీటకములు పుష్పములయందు తేనెను పానముచేయునప్పుడు మకరందధూళి వాని దేహమం దంటుకొనును. ఈ కీటకములొక పుష్పమును వదలి మఱియొక పుష్పమునందు వాలి తేనెను వెదకుచుండును. అట్లు వెదకునపుడు వాని దేహము కీలాగ్రంబులకు తాఁకఁగానే, దేహముపై నుండు మకరందధూళి కీలాగ్రమున నంటుకొనును.

మిథున పుష్పములలో నొక్కొంటియందు రెండు లింగముల యవయవము లొక పుష్పమునందే యుండుటంబట్టి నొక పుష్పమందుండు మకరంద రేణువు లా పుష్పముయొక్క యండమును గర్భధారణమున కుపయుక్తముగా చేయ నుపయోగపడదు. తఱుచుగా మకరంద రేణువు లితర పుష్పముల నుండి కీలాగ్రంబునకుఁ దేఁబడుచున్నవి. అట్లు తేఁబడని యపుడు మాత్రమే అదే పుష్పమునందుండు మకరందధూళి దాని కీలాగ్రము నంటఁబడును. తనలోని పుప్పొడి సంపర్కము వలనఁ గలుగు విత్తనములకంటె మఱియొక్క పుష్పములోని పుప్పొడి సంపర్కమువలనఁ గలిగినవి వీర్యమునందును బలమునందును మించియుండును.

మిథున పుష్పములలోఁ గొన్నిటి యందు స్వకీయ మక రంద స్పర్శము గలుగుటకుఁ బలువిధములగు నాటంకము లేర్పడి యున్నవి. కేసరములును, అండ కోశమును ఒకే పువ్వు నం దుండినను, అవి యేకకాలమందు పక్వ మగుటలేదు. ఈ రెం టిలో నొకటి పక్వమయిన కొంత కాలమునకుఁ బిదప, మఱి యొకటి పక్వమగును. కావున ఈ స్వకీయ మకరంద ధూళిస్పర్శ ములేక పోవుచున్నది. ఇట్లు సంభవించుట బంతివంటి పుష్ప మంజరులందుఁ జూడ వచ్చును. మఱికొన్ని పుష్పములలోఁ గీలాగ్రము పక్వముగా నున్నపుడు, ఆ పువ్వుయొక్క కేసర ములు కీలమును సమీపింపక వేరొక ప్రక్కనైనను పుష్పము యొక్క లో పార్శ్వమందైనను బెరుగుచుండును. కేసరంబులు పక్వమై చక్కగా నిలుచునపుడు కీలాగ్రము వాలిపోవును.

ఇతర మకరంద రజస్స్పర్శమునకు సహాయముగాఁ బు ష్పంబులలో నేర్పడియుండు సాధనంబులు పెక్కులు గలవు. అవియన్నియు నిచ్చట వివరించి చెప్పుటకు సాధ్యము కాదు. ఇతర మకరందరజస్సంపర్కమను విషయమును మిగుల సులభం బుగా నిరూపింప వచ్చును.

ఒకచెట్టునఁ బూచిన రెండు పువ్వులను గుఱుతుపెట్టు కొని, వాని కేసరములను దీసివేసి, దానిలో నొక్కటి నేమిచేయ

కయు, మఱియొక్క దాని కీలాగ్రమునకు నితర పుష్ప మకరంద ధూళిని జరిమియు నీ రెంటిని దోమతెర తిత్తిలోఁ గప్పి, కొన్ని దినములైన పిదపఁ బరీక్షించిన యెడల, వానిలో మకరంద స్పర్శములేని పువ్వు క్రుళ్లిపోవును. మఱియొకటి కాయతోఁ గూడియుండును. ఈ సూక్ష్మ పరీక్షవలన గర్భము ధరించుటకు మకరంద ధూళియొక్క స్పర్శ మావశ్యకమనియు, ఒక పుష్పముయొక్క మకరంద ధూళి అన్య పుష్పములను గర్భము ధరింపఁజేయఁ గలవనియు మన మూహింప వచ్చును. ఇట్లుండ ఏకలింగ ద్విలింగ వృక్షములయందు వేఱొక్క పుష్పముయొక్క మకరందరజస్సంపర్కము జరుగుచున్నదని వేఱుగఁ జెప్పవలయునా?

---

## 8 - వ అధ్యాయము.

### ఫ ల ము.

---

గర్భధారణకుఁ బిదప పుష్పమునందుఁ గలిగెడు మార్పులలో ముఖ్యమైనది యండాశయము ఫలముగా మారుటయే. మన మిదివఱకు నుదాహరణంబుగా గ్రహించిన గంగరావి, కమ్మెత్తి మొదలగు వానియొక్క పువ్వులు పూఁచి కొం

తకాలము మాత్రమే ప్రకాశము గలిగియుండును. పుష్పించి, ఒకటి రెండు గడియలలోనే రాలిపోవు దళములును గలవు.

పుష్పములు పూచి యుండునప్పుడే తుమ్మెదలు, తేనెటీఁగలు మొదలయినవి పూఁ దేనెను పానము చేయఁ బోచ్చినప్పుడు తమమొడల్లి ... నంటిన మకరందపు ధూళిని గీలాగ్రమునకుఁ దాఁకునట్లు చేయుచున్నవి. పుష్పదళముల యొక్క యందము, వన్నెయు, కీటకమును దమమీఁద వాలునట్లు చేయ నేర్పడిన సాధనములని పలుమారు చెప్పఁబడి యున్నది. సంధ్యాప్రాప్తులందు పసపు, ఎఱుపు, నీలము మొదలయిన రంగులు గల పూవులు బాగుగాఁ బ్రకాశింపవు. కాఁబట్టి యీ వేళలందుఁ బూఁచెడు పుష్పములు తెల్లని దళములుగల్గియుండును. పగటివేళలందుఁ బూచెడివి, స్వాభావికముగా ననేక వర్ణంబులు గలిగి యుండును. రంగుల భేదంబులు తుమ్మెదలు మొదలైన వాటికిఁ దగినట్లుండును. ఒక్కవన్నెగల పువ్వులు కొన్ని తుమ్మెదలను మాత్రము దమవద్దకాకర్షింప






100-వ పటము.—గంగరావి కాయలును, వానియడ్డనఱుకుడు ముఖములును.

గలవనియు, అవి యీ తుమ్మెదలకుఁ దగిన రంగుల దళము లుగలవిగా నుండుననియు మనమూహింప వలయును.

పుష్పములయొక్క కీలాగ్రముల యందుఁ గీటకాదు లువాలుట వలననో, గాలి వీచుట వలననో, మకరంద ధూళి పడిన పిదప, దళము లనావశ్యకములే. దళములయొక్క వాడు దల గర్భధారణమైన దనుటకు గుఱుతు. గర్భధారణంబునకుఁ బిదపఁ గొన్ని దినంబులు గడువఁగానే గంగరావి పూల దళము లు వాడి, యెఱ్ఱనై కేసరపు గొట్టములతోఁ గూడ రాలిపోవు చున్నవి. అనంతరమున అండాశయము పెంపై క్రమము గా ముదరి కాయ యగుచున్నది. పుష్పించెడి యోషధు లన్నిటియందు గర్భ ధారణంబునకుఁ బిదప నండాశయము ఫలముగా మాఱి పోవుచున్నది. గర్భ ధారణమునకు ఫల మిదియే.

ముదిరిన గంగరావి కాయ యొక్క పై భాగమునకు మధ్య ప్లుముగా నుండు చోటు కీలాగ్రముల యొక్క క్రిందఁ గొంత భాగమైనను లేక, యది యున్న గుఱుతునైనను దెలుపు ను. కాయను అడ్డముగాఁ గోసి చూచిన యెడల 100-వ పట మునఁ జూపియుండులాగున నైదు గదులు గనఁబడును. ఈ గ దుల యందుఁ గొన్నిటిలో మాత్రము విత్తనంబు లుండును.

కొన్నిటిలో నుండవు. మఱియుఁ గొన్ని ప్రదేశములయందుఁ బెరిగెడి గంగరావి కాయలయందు విత్తనములు గలుగవు.




101-వ పటము.—గంగరావి కాయ.

1. చీలుచుండు కాయ. 2. బీజకోశము. 3, 4. విత్తనములు.

ఈ కాయలయొక్క గదుల గోడలు అయిదును మధ్య భాగమం దొక్కచోటఁ గలియుటవలన నేర్పడు స్తంభము అండాశయముయొక్క మధ్యస్తంభమని పూర్వమే చెప్పి యున్నాము. విత్తనము లీ స్తంభమునందు సన్నని తంతువులతోఁ జేర్పఁబడి యున్నవి. ఈ తంతులకు "బీజ బంధకము" లని పేరు. బీజబంధకము మిక్కిలి సన్నదైనను అండములు, బీజములు పెరుగుటకు వలసిన యంగమిదియే. వృద్ధియగుటకుఁ గావలసిన యాహా

పదార్థంబులు దీని గుండ నండంబులకును బీజంబులకునుం బోవుచున్నవి.

గంగరావి ఫలముయొక్క విభాగము లెవ్వియనంగా:- బీజమును, బీజబంధకమును, వీనిని లోఁగొని యుండు పై పెంకునే. విత్తనములును, బీజ బంధకములును లోపలఁ గలిగిన పై పెంకునకు "బీజకోశ" మని పేరు. గంగరావి పిందెకును, గాయకును బరిమాణమునందుఁ దప్పఁ దక్కిన విషయంబులలో నధిక భేదంబులు గానఁబడవు. గంగరావి కాయ పక్వమైన పిదపఁ గ్రిందపడిన చిర కాలమునకు 101-వ పటమున గనఁబడుచి యున్నట్లు దాని బీజకోశంబు పగిలి విత్తనంబులు రాలిపోవును.

ఉమ్మెత్తకాయ రెండుగదులుగలది. బీజకోశముయొక్క వెలి పార్శ్వమందుఁ జిన్న ముండ్లుండును, కాయకుక్రింది వైపునఁ బుష్పకోశము యొక్క కొంత భాగము నిల్చి యుండును. ముదిరిన కాయలోని రెండుచిన్న గదులు నాలుగు గదు





102-వ పటము.—ఉమ్మెత్తకాయ.

1. చీలుచుండు కాయ.
2. అడ్డు-చీలిక ముఖము.

లుగా చీలి యుండును. కొంత కాలమునకు కాయ యెండిపోయి, బీజకోశముయొక్క పైభాగంబు పగిలి నాలుగు చీలికలగును.

బెండ కాయయందును గదులు గలవు; ఇవియయిదు మొదలు పది వఱకుండును. ప్రత్తికాయలో మూడు గదులుండును. ఈ కాయలన్నియు పగిలి విత్తనములను వెలిపఱచుచున్నవి.

అవిసె, పొన్న యీ కాయలలో నొక్కొక్క గదియే యుండును. పొన్న కాయలందు విత్తన మొక్కటే యుండును. అవిసెయందుఁ జాలవిత్తులున్నవి. అవిసెలో బీజ కోశమంతయు నెండిసన్నని పెంకుగానుండును; ఆ పెంకు పగిలి విత్తనములు రాలుచున్నవి. పొన్న కాయలో బీజకోశపు లోభాగము పెంకుగాను, పై భాగము కండగాను నుండును. వీనియందు ముందు చెప్పిన బొప్పాయి విత్తనము



103-వ పటము.—బేరికాయ యడ్డు నఱుకుడు ముఖము.

బీజకోశమునుండి బయటికి రాదు. ఈ ఫలమందు బీజకోశము యొక్క పైభాగమైన కండ ముఱిగిపోయి లోపెంకుమాత్రము నిలిచి యుండును. ఇదియే పొన్నవిత్తన మనఁబడునది.

మనము మీఁదఁ జెప్పిన కొన్ని ఫలముల నిర్మాణములను దెలిసికొనుటచేత వానియందనేక భేదంబులున్నవని చక్కఁగాఁ దెలియుచున్నది. గర్భధారణంబునకుఁ బిదప నండాశయమునందు వివిధమైన మార్పులు గల్గుటతోఁగూడ, పుష్పముయొక్క యితర భాగంబుల లోను మార్పులు గలుగుట స్వభావసిద్ధము. కొన్ని చెట్లయందు పుష్పకోశము అండాశయంబుతోడఁ బెఱిగివచ్చును. ఇందులకు నుదాహరణంబుగా బుడ్డసర (81- పటము.), వంగ వీనికాయలను జెప్పవచ్చును. మఱిన్ని పుష్పములయందుఁ బుష్పకోశము పెఱిగి బీజకోశంబునైనను వృంతముయొక్క పైభాగంబుతోనైనను జేరి యంత



104-వ పటము.—చేరికాయ నిడివి నఱుకు ముక్కను.

యు పండుగా నగుటయుఁ గలదు. చేరి, సీమరేగు పండ్లలో మన
ము భుజియించు కండ వృంతమే. మధ్య దృఢంబుగానుండి య
యిదు గదులుగా భాగింపఁబడియుండు భాగము మాత్రమే యం
డాశయము. ఈ పండ్లలో నండాశయమునందు గోడలులేక బీజ
కోశంబు మిక్కిలి భేదంబు పొందుటలేదు. అయినను దానికి
బదులుగా వృంతము పెరిగి యండకోశమును గప్పుకొని, కండ
గలదై పెరుగుచున్నది. ఈ విషయము లిక్కడ ముద్రించియుం
డు 103, 104-వ పటము
లను గమనించి చూచిన
యెడల స్పష్టముగాఁ దె
లియును.




105-వ పటము.—ముంతమామిడి పండు
(వృంతపరిణామ ఫలము.)
1. పండు. 2. విత్తు. 3. విత్తుయొక్క నిడివి నఱుకు ముఖము. 4. పప్పు.

పుష్పవృంతము బలి
సి, కండగలదై యండా
శయమును లోపల నంచు
కొనక, ప్రత్యేకముగ నుం
డి పండువలె నుండుటయుఁ
గలదు. ఉదాహరణముగా
ముంతమామిడి ఫలముఁ
జెప్పవచ్చును. ముంతమా

మిడి వి_త్తనునదియె కాయ. దీనితో నంటుకొనియున్న కండయు, రసమును గల భాగము పండనఁబడినను, అది నిజముగాఁ బండు గాదు. అది బూటకపు పండు. వృంతమె యిట్లు మాఱుపాటు నొందుచున్నది. కాయయొక్క భాగములగు బీజమును, బీజ కోశమును ముంతమామిడి వి_త్తనంబులో నుండుటచే నీ భాగమె కాయయనియు, ముంతమామిడిపండనఁబడెడి భాగమునం దీ రెండు లక్షణములు లేమిచేత నది కాయ కాదనియు గ్రహింపవలయును. అనే కౌషధులయందుఁ బుష్పమంజరి యంతయు నొక్కటిగాఁ గూడి, ఐక్యము నొంది, వృద్ధినొంది కాయగా మాఱుట వాడుక. పనస, అనాస, మల్బెర్రి, అ_త్తి మొదలగు పండ్లిట్టివి.

ఇతర భాగంబుల సంబంధము లేక, బీజకోశము బీజము నను నీ రెండు మాత్రము గల ఫలములు "సామాన్యఫలము" లనియు, ఇతర భాగములతోఁ జేరియుండు ఫలములు "మిశ్ర ఫలము" లనియుఁ జెప్పుట వాడుక.

గంగరావి, బెండ, అవిసె, ఉమ్మెత్త వీనికాయలు సామాన్యఫలములు. ముంతమామిడి, రేగి, పనస, అ_త్తి మొదలగువానికాయలు మిశ్రఫలములు. కాయలందుఁ గలిగెడి సకల భేదములును వి_త్తనంబులు పక్వమై వెలుపలఁ జెదరునంతవఱకు

వానిం గాపాడుటకును, అటుపిమ్మట నా విత్తనంబులు చెదరుటకును నేర్పడిన సాధనములుగా నున్నవి యని యెంచవలయును.



106-వ పటము.—వంకాయ. (కండకాయ.)

కొన్ని సామాన్యఫలములయందు బీజకోశము మెత్తనై కండగలిగియు, కొన్నింటియం దెండియు నుండును. వంగ, మామిడి, పొన్న, ద్రాక్ష, అరఁటి వీని బీజకోశము మెత్తనై కండగల్గి యుండును. అయితే, వంగ, ద్రాక్ష వీనిలో బీజకోశమంతయు సన్ననై కండగలది గానే యున్నది. ఇట్టి కాయలను "కండకాయ" లని లేక (రసవత్ఫలములని) చెప్పవచ్చును. మామిడి, పొన్న మొదలగు కాయలలో బీజకోశము వెలుపటఁ గొంత

భాగము కండ పట్టినదిగాను లోపలి భాగము గట్టి పెంకుగాను నుండుటంబట్టి వీనిని "లోపెంకు కండకాయ" లని చెప్పుట మంచిది.




107-వ పటము.—మామిడి కాయ. (లోపెంకు కండకాయ.)
1. కాయ. 2. లోపలినున్నది తెలియునట్లు చెక్కి తీసిన కాయ చీలిక. 3. ముట్టెయున్న పలుకులు.

బీజకోశముయొక్క వెలుపటి భాగము కొంతమాత్రము పెంకుగాను, లోపల నంతయు కండ గలదిగాను నుండు కొన్ని కాయలు గలవు. గుమ్మడి, బూడిదెగుమ్మడి యివి యట్టివి. వీనిని "పై పెంకు కండకాయ" లని చెప్పుట యుక్తము. మఱియుఁ గొన్ని కాయలలో బీజకోశము లోపలిభాగము కొంతమాత్రము కండగలదిగాను, వెలుపటి భాగమంతయు పెంకు





108-వ పటము.—పొన్నకాయ.
(లోపెంకు కండకాయ.)
1. కాయలు. 2. నిడివి చీలికయొక్క రూపు.

గాను నుండుటయుంగలదు. వెలఁగ, మారేడు కాయల నుదాహరణముగాఁ గైకొందు. ఇవియును పై పెంకు కండకాయ లైనను వీనిలో గదులు విశేషముగా నుండును. గుమ్మడివంటి కాయలలో గదియొక్కటియె యుండును.







109-వ పటము.—ద్వివిదారణ పుటక ఫలములు.

కండగల కాయలలో భేదము లుండునట్లు ఎండిన బీజకోశము గల కాయలలోను బలుభేదములు గలవు. అవిసె,



110-వ పటము.—ఏక విదారణ స్ఫుటక ఫలము.

చిక్కుడు, కంది, బెండ్రిసె కాయలలో గది యొక్కటి యుండును. కాయలు బాగుగా ముదిరి యెండుగాయ లయిన తర్వాత, కొన్ని పగిలి వి త్తనములు చిట్లునట్లు చేయును. ఈ కాయల కిరు వైపులందును చార లుండుట గలదు. ఆ రెంటిలో ఒక చార పగులునుండి కాని, రెండు చారల పగుళ్లనుండి కాని విత్తనములు బయట వచ్చుచుండును. ఇట్లు పగులని యెండు కాయలును గలవు. ఇట్టి కాయలు "ద్వివిదారణస్ఫుటక ఫలము"

చారయుఁ గలిగి యొక
లనఁబడును. ఒక గదియు, నొక
వైపున మాత్రమె చిట్లునట్టి కాయలును గలవు. జిల్లేడు,
పాలతీఁగ కాయ లిట్టివి. ఇవి " ఏకవిదారణ ఘటక ఫలము"
లనఁబడు.




111-వ పటము.—బెండకాయలు.

1. పిందె. 2. దానియడ్డపు చీలిక చూపు. 3. చిట్లినకాయ.
దానియడ్డపు నఱుకు.

గంగరావి, బెండ మొదలగు కాయలవంటి కాయ
ఎండుకాయలు. ఇవి పెక్కు గదులను గలిగి వీనిలో ప

ళ్లనేకము లుండుటచే నిట్టివానిని “ బహు విదారణ స్ఫుటక ఫలము” లని చెప్పఁదగును. ఇట్టి యెండుకాయలలో నీ పగుళ్లు రెండు విధములు. కొన్ని కాయలు గదులలోపలను మఱికొన్ని కాయలు గదిగోడల లోపలను బగులును.

గంగరావి, బెండ వీనికాయల పగులు “గది దారిపగులు”; అనఁగా నీకాయలు గదులదారిని బగులునట్టి యనేక గదులుగల కాయలు. ఆముదపు కాయ, గాడిదగడపరకాయ, తుత్తిరి కాయ వీనిపగుళ్లు “గదిగోడదారిపగు” ళ్లనఁబడును. గదిదారి పగులు గల కాయయం దొకపగులునుండియె విత్తులు బయటికి వచ్చుచుండును.గదుల గోడ దారి పగులు గల కాయలందుండు గదులు వేర్వేఱుగాఁ జీలి యుండు నె




112-వ పటము.—గాడిద గడపరజాతి కాయ.

1. లేఁతకాయ. 2. చిట్లినకాయ.
3. చిట్లినకాయ యడ్డుకోత.

కాని, వానియందున్నవి త్తనంబులు వెలుపలికి రావు. ఇట్లు వెవ్వేఱుగా నుండు భాగములు మఱల గదిదారియందు పగులుచూపి విత్తనంబులను వెలువరించును. (113 - వ పటమునుజూడుఁడు.) గదిగోడదారిపగులునట్టి కాయలలోఁ గదులు ప్రత్యేకప్రత్యేకముగా నేర్పడిన పిదప మఱలఁ బగులుచెంది విత్తనంబులను వెలువరించుకాయలునుగలవు. గోడదారిపగులుచూపిన తర్వాత గదులు బొత్తిగా వేఱువేఱుగా విడక, యడుగున మాత్రము చేరియుండి లోపలితట్టున నొక్కొక్కగదియు మఱియొక్క తూరి పగులుపాఱి, యాదారి ద్వారా విత్తనంబులు వెలువరించు కాయలును గలవు. మొదటఁ జెప్పిన స్వభావము గలవి ఆముదపుఁ జెట్టు కాయలు. వెనుకఁ జెప్పినరీతి గలవి గాడిదపర కాయలు.




113-వ పటము.—ఆముదపు కాయ.

1. కాయ. 2. చిట్లినకాయ.
3. చిట్లినకాయ పలుకులోపలిచూపు. 4. పలుకుచిట్లుట.

ఎండుకాయలలోను నెప్పటికిని పగులుచూపకయె యుండునవియుఁ గలవు. వీనిలో బీజకోశ మంతయు నొక పెంకు లాగున నైనను, లేక, లోభాగము పెంకు, వెలుపలిభాగము పీచుగా నైన నుండును. కొబ్బరికాయ యిట్టి కాయయె. నిపై నుండు బొరికి, పీఁచు, చిప్ప యివి యెల్ల బీజకోశము




114–వ పటము.—టెంకాయ.

1. కాయ. 2, 3. ఒక ప్రక్క బొరికతీసిన కాయ. 4. బొరికలేని కాయ. 5. టెంకాయతోఁగూడిన చిప్ప.

యొక్క యంగములు. చిప్పలో నుండు కొబ్బరి కురిడియె విత్తు. టెంకాయ పుష్పములలో నుండు నండకోశమునందు మూడు గదు లున్నను, గర్భధారణంబునకుఁ బిదప వానిలో నొక్క గది మాత్రము గొప్పదియై, విత్తనంబు గలిగియుండును. తక్కిన రెండు గదులు గొప్పవి యగుట లేదు. వానియందు విత్తును లేదు. బొరికతీసిన కొబ్బరికాయయొక్క జుట్టునకుఁ గ్రింద నుం

డు మూడు పల్లములును అండాశయములోని చిన్న గదుల యానవాళ్లే. వీనిలో నొక్కటి మాత్రము పెద్దదిగా నుండును. ఇదియె పెరిగిన గది. కొబ్బరికురిడీయం దీ పల్లమునకు సరిగా జిన్న మొలక యొక్కటి పూడియుండును. కొన్ని కొబ్బరికాయలలో రెండు లేక మూడు గదు లుండుటయుఁ గలదు. ఈ గదులందు వెవ్వేఱు కొబ్బరికురుడీ లుండును. అండాశయపు గదు లన్నియుఁ బెరుగుటవలన నిట్లు రెండు మూడు గదు లేర్పడుచున్నవి. కొబ్బరికాయ వంటి కాయలు "అవిదీర్ణ కఠిన ఫలములు" అని చెప్పఁబడును.



115-వ పటము.—అనాసపండు. (పుష్పసమూహ పరిణామ ఫలము.)

మిశ్ర ఫలములందు నండకోశము తక్కిన భాగములతోఁ గూడియున్న దని యింతకు ముందె చెప్పఁబడి యున్నది. ముంత మామిడి కాయయందుండు వృంతము మాఱు రూపము నొంది కాయతోఁ జేరియుండుటవలన దీని "వృంత పరిణామ ఫల" మని చెప్ప వచ్చును. పనస, అనాస పండ్లును అత్తి, మఱ్ఱి, రావి వీని కాయలును

మిశ్ర ఫలములె. ఈ మిశ్ర ఫలవృక్షములం దనేక పుష్పంబులు గూడి యొక్కటై కాయలగుచున్నవి. పనస, అనాస యీ పండ్లలో వెలుపటఁ గంట్లుకంట్లుగా నేర్పడియుండు భాగ మొక్కటొక్కటియు నొక పుష్పము. అనాస చెట్టునందలి పుష్పములు కంకులుగా నేర్పడి, నడిమి కాడతోఁ గూడఁ దామును పెరిగి, కండ పట్టి, గొప్ప కాయలుగా నేర్పడుచున్నవి. గర్భధారణకుఁ బిదపఁ బుష్పము లన్నియు నొక్కటిగాఁ జేరి యొకటే కాయగా వృద్ధి నొందుచున్నవి.

పనసచెట్లయందును పువ్వులు కంకులుగా నేర్పడి పెరుగుచున్నవి. అయితే మగపువ్వు లొక కంకిగాను, ఆఁడు పువ్వులు వేఱొక కంకిగాను నేర్పడియుండును. మిథున పుష్పములు వీనియందుఁ గలుగుటే లేదు. గర్భాధానమునకుఁ బిదప నాఁడుపువ్వులు గల కంకిమాత్రము పెరిగి, కాయగా మాఱుచున్నది. మగపువ్వులు గల కంకులు మకరంద ధూళిని గలిగించుటకు మాత్ర మేర్పడియున్నందున, మకరందధూళి చెదరి పోయిన పిదప నవియు నెండి, రాలిపోవుచున్నవి. పనసపండులోపల నుండు తొనల యొక్కొక్కటియు నొక్కొక్క యాఁడుపువ్వే. మనము భక్షించెడు కండభాగమె పుష్పకోశ దళవృత్తములకు మాఱుగా నేర్పడిన భాగము. తొలుతఁ

గూడి తిత్తివలె నుండు విత్తనంబె యండకోశము. విత్తనంబును లోపలఁ గల్గియుండు తిత్తియె బీజకోశము. బీజకోశముగా నుండెడి తిత్తియొక్క యొక ప్రక్కన పోఁగువలె నంటుకొని యుండునదే కీలము.

గర్భధారణమునకుఁ బిదప స్త్రీ పుష్పములు గల కంకియందు కొన్ని పూవులు మాత్రమె తొలలుగా మాఱుచున్నవి. కొన్ని వట్టి నారతడపలుగా నిలిచిపోవుచున్నవి. ఈ నారతడపలవంటివానిని పెరుగక గిటకబాఱిన పువ్వులని యెంచవలెను. ఇట్టి ఫలములకు "పుష్పసమూహ పరిణామ ఫలము" లని పేరు పెట్టవచ్చును.

అత్తి, మఱ్ఱి యీపండ్లు గూడఁ బుష్పసమూహ పరిణామ ఫలములె. అయితే, వీనిలోని పూవులు మిక్కిలి చిన్నవిగాను, ఎక్కువగా మాఱుపాటు నొందినవిగాను నున్నవి. పుష్పముల వహించియుండు వృంతములును వీనియందు మాఱుపాటు నొందుచున్నవి. వృంతమొక గిన్నెవలెఁ బెరిగి పుష్పములను లోపల నావరించుకొని యున్నది. ఎప్పుడు రానివాఁడొక్కఁ డెరుదుగా వచ్చి నట్లైన, వాని రాక "యత్తి పూచిన" ట్లున్నదని మనము సామెతగాఁ జెప్పుదుము. అత్తిచెట్టు పువ్వులు పూచుట లేదని గదా యీ సామెతయొక్క తాత్పర్యము. అట్లు అత్తిపువ్వులు లేవని చెప్పుట ప్రత్యక్ష విరుద్ధముగా

నున్నది. పుష్పము పుష్పించి వేగమే కాయ యగుచున్నదని కొందఱి యభిప్రాయము. ఇదియు సరికాదు.

మఱ్ఱిచెట్టు నందలి లేఁత పిందెలను, ముదిరిన కాయలను గోసి లోనుండు భాగములను బాగుగాఁ జూచిన పక్షమున, విత్తనములవలె నుండున వన్నియు పువ్వు లని మనము దెలిసికొనవచ్చును. 116–వ పటమునందు ముద్రింపఁబడియుండు




116–వ పటము.—మఱ్ఱికాయలు.

1. కాయలు. 2. కాయ నిలువ చీలిక. 3. ఆఁడుపువ్వు. 4. కీటకాండపు కాయ.

మఱ్ఱికాయను, గోసిన దాని యొక్క లోపలి తట్టును జూచిన యెడల, వానిరూపు చక్కఁగాఁ దెలియవచ్చును. కాయయొక్క పై

నఁ గనఁబడు రంధ్రము చుట్టును గనఁబడునదే వృంతపు గిన్నె యొక్క పై యంచు. అచ్చటఁ గనఁబడు పుచ్ఛములు వృంతపుచ్ఛములు. వీనిదాపున లోపలితట్టుగా నుండునవి మగపువ్వులు. కాయయొక్క నడుమను అడుగునను ఆఁడుపువ్వులును పురుగు గ్రుడ్ల పూవులు నుండును. ఇట్టి కాయలను "సవృంత పుష్పసమూహ పరిణామ ఫలంబు" లని చెప్పవచ్చును.




117-వ పటము.—బాడిసెవిత్తనము.

1. విత్తు. 2. విత్తనముపైచాయ. 3. మొలక, అంకురదళములు. 4 మొలకయొక్క క్రిందికొన త్వక్కుయొక్క లోభాగము. 5. వేఱుపఱచిన యంకుర దళములు. 6. అంకురము. (2, 6. పటములు కొంచెము పెద్దవిగాఁ జూపఁబడి యున్నవి.)

గర్భధారణమైనతోడనె యండాశయము కాయ లగు నట్లు, అండములు విత్తనంబు లగుచున్నవి. విత్తనంబు పెక్కు

రూపభేదంబులు గలిగియున్నది. కనుక వానిరూపు దెలియుట కై బాడిసె, మామిడి, ఆముదపు విత్తనంబులం బరీక్షింతము.

బాడిసె విత్తొకవిధమైన యెఱ్ఱ రంగును, ఒకప్రక్కన నొక చారయుం గలిగియున్నది. అండాశయమునందు బీజము చేరి యుండు స్థలముం దెల్పున దీ చారయె. ఈ విత్తును నీటిలో నానంబెట్టి, మెత్తపడిన తర్వాత పైతొక్కు నొలిచి లోపలం జూచినట్లయినం దెల్లని రెండు పలుకులు గనంబడును. ఈ పలుకులను సులువుగా విడందీయవచ్చును. ఈ పలుకులయొక్క యొక యంచునందు మొలకయొక్క యడుగుభాగము గానంబడును. ఇది విత్తుయొక్క పైతోలునకు లోపలంగాం జారకు మీందుగా నుండు స్థలములో నుండుటయుం దెలియును. ఈ రెండు పలుకులను "అంకురదళములు" లనంబడును. అంకురదళములను విడందీసి చూచిన యెడల, వానినడుమ నంకుర ముండుటయు, ఆ యంకురము అంకురదళములతోం జేరియుండు విధంబును జక్కంగా నెఱుంగందగును. అంకురముయొక్క యూర్ధ్వభాగ మంకురదళంబులకు లోపలికిని, దానియొక్క యధోభాగము వీనికి వెలుపలికిని వచ్చియున్నవి. (117-వ పటమును జూడుండు.)

బాడిసె విత్తుయొక్క భాగము లేవి యనిన, అంకురదళములు, అంకురము, వీనిం గప్పికొనియుండు త్వక్కు. విత్తుయొక్క

పై తొక్కను గమనించి చూచిన యెడల, అందు రెండు పొరలుండుట గనఁబడును. ఆ రెంటిలో వెలుపలిది కఠినముగాను,లోపలిది సన్నగాను నుండును. ఈ రెండు చర్మములును నండత్వక్కులె. గర్భధారణా నంతరమున నివి బీజత్వక్కు లగుచున్నవి. అండరంధ్ర ముండినస్థానము కొన్నిటిలోఁ గనఁబడును. బాడిస విత్తునందు చారకుఁబైఁగాఁ గనఁబడు చిన్నపల్ల మండరంధ్ర


















118-వ పటము.—పొన్నకాయ.
1. కాయయొక్క నిడివి చీలిక. 2. అంకురదళములు.

119-వ పటము.— ఆముదాలు.
1. విత్తనము. 2, 3. అంకురచ్ఛదనము, అంకురము.

ముండిన చోటె. మొలకయొక్క క్రిందికొన విత్తులోపల నీపల్లమునకు దాపున నుండును. నానిన విత్తుయొక్క పైతోలు

ఆఱిన పిదప, చేతితో నదిమినట్టయిన నీపల్లమునుండి కొంచెముగా నీరు వెలువడును.

పొన్న, మామిడి వీని ముట్టెలు విత్తుగాదు. మామిడి ముట్టెలోపల నుండు పప్పె విత్తు. పప్పును గప్పుకొని యుండు కావిరంగు తోలె బీజత్వక్కు. ఈ రెండు విత్తులందును రెండంకురదళము లున్నవి. అంకుర మీ యంకురదళముల నడుమ నొక యంచునం దుండును. భూతసవిత్తులోఁ గనఁబడు చందమున వీనిలోని యంకురభాగము లొక్కటిగనున్నను జక్కఁగా గానరావు. విత్తుపై మూసికొనియుండు పెంకు బీజకోశము యొక్క లోపలి భాగము.

ఆముదపు విత్తునందు మీఁదితోలు అనఁగా బయటిబీజత్వక్కు గట్టిదిగా నుండును. ఈ పెంకులోని విత్తునకు మీఁది భాగమునఁ దెల్లని యొక పుచ్ఛము గలదు. ఈగట్టి పెంకును బగులఁ గొట్టి చూచినట్టయిన, లోపలఁ దెల్లని వస్తువొకటి




120. పటము.— ఆముదపువిత్తు యొక్క అడ్డపు చీలిక. నిడివి చీలికయు.

గలదు. ఈ భాగమును గమనించి చూచినట్లైన, దీనిమీఁద సన్నని మఱియొకతోలు గనఁబడును. ఇదియె బీజముయొక్క లోపలిత్వక్కు. ఈ బీజాంతస్త్వక్కులో నణఁగియుండు లావైన పలుకులను రెంటిని వేఱుపఱచి చూచినట్లైన, ఒకప్రక్కనఁ జిన్న యంకుర మొకటి చీలవలెఁ గనఁబడును. ఈ యంకురము నరములుగల రెండు తెల్లని యంకురదళములతోఁ జేరియుండుటను నంకురమును బెఱికి చూచినచోఁ దెలియవచ్చును. (119-వ పటమును జూడుఁడు.) అంకురదళములు లావైన మఱియొక తీరుపలుకులతోఁ జేరియున్నవి. ఇప్పలుకు లంకురదళములే కావు; బాడిసె, మామిడివిత్తులందు లేని యొక్క క్రొత్త భాగమిదియె. దీనికి "అంకురచ్ఛదనము" అని పేరు. బాడిసె విత్తునందీ బీజదళములు లావై పెరుగుచున్నవి. ఈబాడిసెవిత్తునందును మామిడిముట్టెలోను నంకురచ్ఛదనములు లేవు. మొలకల యభివృద్ధికిఁ గావలసిన యాహారపదార్థము లంకురదళములందే చేరియుండును. ఆముదపువిత్తుయొక్క యంకురదళములందాహార పదార్థములు చేర్పఁబడక, ప్రత్యేక పలుకులుగా నుండు నంకురచ్ఛదనములలోఁ జేర్పఁబడియున్నవి. అనేక విత్తనంబులలో నంకురచ్ఛదనంబు లుండుట గలదు. గంగరావి, సీతాఫలము మొదలగు వాని విత్తుల నుదాహరణంబుగా గ్రహింపుఁడు.

ఈఁత విత్తుయొక్క పై తోలు సన్నగాను, దానిలోపల నుండు పలుకులు మిక్కిలి గట్టివిగాను నుండును. ఈవిత్తనంబు లోపలిభాగము రెండు దళములుగాఁ జీలదు. ఈవిత్తుయొక్క లోపలిభాగము నిడివియైన పల్లము గలదిగాను వెలుపలి భాగ




121-వ పటము.—ఈఁత విత్తనాలు.

1. పల్లముండు పార్శ్వము చూపు. 2. పల్లములేని పార్శ్వము చూపు. 3. నిడివి చీలిక చూపు. 4. అడ్డచీలిక చూపు. (3, 4. లలో అంకురము గనఁబడుచున్నది.)

ము సమముగాను నుండును. సమమగు భాగముయొక్క నడుమ నుండు పల్లమునందు మొలక యణఁగియున్నది. ఒక సూదితో నీ పల్లమును నలుప్రక్కల గ్రుచ్చి చూచినపక్షమున మొలక బయటఁబడును. లేక విత్తును నిడివిగాను, అడ్డముగాను గోసి చూచినచోఁ గూడ మొలక యగుపడును. మొలక పూడియుం డునట్టి యురిదియైన భాగ మంకురచ్ఛదనము. ఇది యొకపలుకు

గానే యుండును గాని రెండు పలుకులుగాఁ జీలుట లేదు. కావున దీని నేకాంకురదళ బీజమని తలంపవలయును.



122-వ పటము.—జాజికాయ.

1. ఒకప్రక్క బీజకోశము ఒలిచినకాయ. 2. బీజపుచ్ఛముల తోఁ గూడిన విత్తనము. 3. బీజపుచ్ఛము.

కొబ్బరిచెట్టులో నుండు కాయ లోపలనుండు కురిడియె విత్తనము. టెంకాయచిప్ప బీజకోశముయొక్క లోపలి భాగము. ఎడనీరు, కొబ్బరియు నంకురచ్ఛదనము లగును. టెంకాయలో అంకురము జుట్టువైపున నున్న పెద్దకంటికి సరిగాఁ బూడియుండును.

విత్తనంబులలోపలి నిర్మాణము ప్రాయికముగాఁ బైనఁజెప్పిన యన్ని విత్తనములలో నుండు నట్లె యుండును. కొన్ని విత్తనములందు బీజత్వక్కు, అంకురము, అంకురదళములు ఇవి మాత్రమె యుండును. ఇంకఁ గొన్నిటిలో నీ భాగములతోఁ గూడ నంకురచ్ఛదనంబు లుండును. ఆముదాలలో నూనె యుండు భాగమును, కొబ్బరి కాయలలో ఎలనీరును, కొబ్బరియు, ఈత విత్తునందు గట్టిగా నుండు భాగమును నంకురచ్ఛదనములె. అంకురముల యభివృద్ధికిఁ గావలసిన యాహార పదార్థము లంకుర దళములం దున్న యెడల నంకుర

చ్ఛదనంబు లుండవు. ఆహారపదార్థము లంకుర దళములలో లేక యున్నప్పు డంకురచ్ఛదనంబు లట్టి విత్తనంబుల కుండుట వాడుకయె. అట్టి యంకురచ్ఛదనంబులు పలుతెఱఁగులుగా నుండును.




123-వ పటము.—సీమ చింతకాయ.

1. కాయ. 2. ఒకప్రక్క తోలు తీసినకాయ. (దీని విత్తనములందు బీజపుచ్ఛములుండుట చూడుఁడు.) 3. బీజము. 4. బీజపుచ్ఛము.

ఆముదాలకుఁ బుచ్ఛము లుండునట్లె యింక ననేక విత్తనంబులకుఁ బుచ్ఛము లుండుటయుఁ గలదు. జాపత్రి యనునది విత్తుయొక్క పుచ్ఛమె. జాజికాయ యనునది విత్తు. దీనిమీఁదఁ బెరిగి దీనిని మూసికొని యుండు జాపత్రి యనఁబడునదె దీనియొక్క బీజపుచ్ఛము. (122-వ పటము చూడుఁడు.)

సీమచింతకాయలోని విత్తును మూసికొని యుండెడి యెఱ్ఱని, లేక తెల్లని భాగమును బీజపుచ్ఛమే.

కొన్ని విత్తులలో బీజత్వక్కునం దంతయు లేక అచ్చటచ్చటనైనను లేక దానిలో నొక్కచోటనైనను నిడివి వెంట్రుకలు గుంపుగా నుండుట గలదు. ప్రత్తి, కొండిసెపాల, జిల్లేడు మొదలగు వానివిత్తులు దీనికి నుదాహరణము.



124-వ పటము.—గాలిలో నెగిరి పోవుటకును, జంతువుల శరీరముల కంటుకొనుటకును దగిన కాయలు.

పుష్పావయవములయొక్క నిర్మాణమును, వాని భేదములును గర్భాధానమునకై యేర్పడినవేకదా. అట్లె కాయల యొక్కయు, విత్తనములయొక్కయు వివిధ భేదము లుండుట దేనికో! కాయలుపండి యెండినతోడనే విత్తనంబులు చెదరి, తగినతావులందు రాలకున్న నవి మొలవఁజాలవు. విత్తనంబు లనేకములుగాఁ గలుగుటయు, వానియందుఁ గలిగెడి యనేకమారుపాట్లును అవి నలుప్రక్కలఁ జెదరిపోవుటకే యని యూహించుట సరి. కా

యలు కండగల్గి యుండుటయు, ఎండిపోవుటయు. ఎండినపిదపఁ బగులుటయు, రోమములను, ముండ్లను గలిగియుండుటయు, తేలికగాను, సన్నగాను నుండుటయు నివి యెల్ల విత్తనంబులు



125-వ పటము.—గాలిలో నెగిరిపోవుటకును, జంతువులశరీరముల కంటుకొనుటకును దగిన కాయలు.

చెదరుట కేర్పడిన సాధనంబులు. కండగలకాయల ననేక జంతువులు భక్షించి, వాని విత్తనంబులను బలుతావులయందు విసర్జించును. జంతువులచే మ్రింగఁబడిన విత్తనములు వాని మలముతోఁ గూడ బయటఁ బడును. ద్రాక్ష, నేరేడు, మర్రి, అత్తి, మఱ్ఱిమొదలగు పండ్లను దీనికి నుదాహరణముగాఁ జెప్పవచ్చు

ను. ఈలాటి విత్తనముల బీజత్వక్కు గట్టిగా నుండుటచే నివి జంతువుల కడుపునందుండినను జెడుటలేదు గావున నిట్టి విత్తనములు పడిన తావులందు మొలచి పెరుగుట గలదు.

జంతువులు సంచరించునపుడు చెట్లపై నొఱచుకొనుట వలనఁ గొన్నికాయలు వానియొడలి కంటుకొని పలుతావులందుఁ జెదరి పోవును. 126-వ పటమునందుఁ జూపఁబడియుండు కాయలపైనుండు నిడుపు వెంట్రుకల కొనలయందు కొక్కు




126-వ పటము.—కొక్కులు గల కాయలు.
(ఈ కొక్కులుండుట చేత నే యీ కాయలు జంతువుల యొడలి కంటుకొనుట.)

127-వ పటము.—టపాసుకాయలు.
1. కాయ. 2. కాయ కొనభాగము. 3. చిట్లినకాయ.

లున్నవి. ఈ కాయలుగల చెట్లలో గొఱ్ఱెలు, గేదెలు మున్నగునవి మేయునపు డొఱచికొనుటచే నీకాయలందుండు కొక్కులు

వానియొక్క దేహముల కంటుకొని, పిదప నీజంతువులు పలుతావులందు సంచరించునప్పు డచ్చటచ్చట రాలిపోవును. గొప్ప కొక్కులుగల కొన్నికాయ లనేక ప్రదేశములందుఁ గనఁబడును. ఆఫ్రికా దేశమునం దొక చెట్టునం దిట్టి గొప్ప కొ




128-వ పటము.—గాలిలో నెగిరిపోఁదగిన తేలికకాయలు.

1. ఏపెజాతికాయ (Hardwickia Pinnata.) 2. వేఁగిసకాయలు. 3. కోతిగోరుకాయ. 4. పెద్దమ్రానుకాయ.

క్కులు గల కాయలు కాచుచున్నవనియు, ఆ కాయలు సింగముల మొదలి కంటుకొనుననియు, పిమ్మట నవి వానిఁ దీయుటకుఁ

ప్రయత్నించునపుడవి వాని నోటిలోఁ జిక్కుకొనుటచే నా సింహములలోఁ గొన్ని చచ్చిపోవుచుండుననియు జనులు చెప్పుదురు. ఉత్తరేణి, పలువిధములగు పచ్చిక దినుసుకాయలును నుదాహరణముగాఁ గైకొనవలయును. ఉత్తరేణి యెన్ను ముదిరిన పిదప, నీ చెట్లొరచుకొన్న యెడల, వానికాయ లొడలి కంటుకొనును. మనము వేగముగా కంచెలలో నడచునపుడీ యుత్తరేణి యెన్నులు మనపంచెలకును గాళ్లకును నంటు



129-వ పటము.—ఎగిరి పోఁదగిన తేలిక విత్తులు.

కొనుట యందఱికిని దెలిసిన విషయమే కదా. పచ్చిక యెన్నులు గుడ్డల కంటుకొనుటను మనము చూచుచున్నాము. చీపురు పొరకముండ్లు గుడ్డల కంటుకొని సూదివలె చురుక్కుమని పొడుచుట మనకుఁ దెలిసియేయున్నది. ఇవియన్నియుఁ గాయలె. మనము వీని నన్నింటిని దీసి పాఱవై చెదము గదా. ముందు చెప్పిన చొప్పున నివియెల్ల విత్తనములు చెదరి పోవుట

కేర్పడిన సాధనములుగదా. 124, 125-వ పటములయందుఁ జూ
పఁబడియుండు, బంతి తట్టలయందు నంటుకొనియును వీనిని వద
లి వేరుగాను నిలిచి యుండు కాయలును చీపురు ముండ్లవలె
బంచలందును రోమములందును గరచుకొనును. వేఱు కొన్ని కా
యలందు బీజకోశమెండి చిట్లుటవలన విత్తనంబులు బహుదూర
మునకు చెదరిపడును. ఆముదపుచెట్టుకాయ లిట్టివి. మఱి
కొన్ని యెండుకాయలు కొంచెము చెమ్మతగిలిన తోడనె
పగులుట వాడుక. అడ్డసరము, ఆజాతిలోఁ జేరిన కొన్ని చెట్లు వీని



130-వ పటము.—గాలిలో ఎగిరిపోవుచున్న విత్తు.

కాయల కొనలలో నొకబుడిపి యుండును. ఈ బుడిపియందు నీ
రు పడఁగానే కాయపగిలి విత్తనంబులు నలుప్రక్కలకుఁ జెదరు
ను. ఈ కాయలను నోటిలో వేసికొని నోరు మూసికొన్న యె

డలఁ గొంత సేపటికి పగిలియుండును. విత్తనములు నోటిలోపల నంగిట బిట్టుగాఁ దగులును. నీటియం దీ కాయలను వేసి చూచుచుండిన యెడలఁ గొంత సేపటికి కాయలు "టప్పు" మనుశబ్దముతోఁ గూడఁ బగిలి విత్తులు చెదరిపోవును. ఈ లాటి యొకకాయ 122-వ పటమునఁ జూపఁబడి యున్నది. ఈకాయ కొనయందలి బుడిపిపైఁ గొంచెము నీరుపోసిన యెడల, వెంటనె యది టప్పుమని కొంతసేపటికిఁ బగులును. ఆకాయ పగులునపుడు చప్పుడు గలుగుటచే దానిని గొందఱు పిల్లలు "టపాసుకాయ" యందురు. అనేకములగు కాయలలో విత్తనములు తేలికగా నుండును. ఇట్లుండుటచే నవి గాలిలో బహుదూరము వరకుఁ గొట్టుకొని పోవును. కొన్నికాయలు వెడల్పుగాను విత్తనముండు తావునందుఁ దప్పఁ దక్కిన చోట్ల సన్నగాను నుండుట స్వాభావికము. ఏపె, పెద్దమ్రాను, వేగిస వీనికాయ లిట్టివి. ఏపె కాయయందు విత్తు లొకప్రక్కన నుండును. వేగిస కాయ యందు పెద్దమ్రాను కాయయందును విత్తనము నడుమనుండుట వాడుక. విత్తుల లోపలిభాగమునను నిల్లె యని తెలిసికొండు. వీని లోపలను నంకుర మొకయోరయందుఁగాని, నడుమఁగాని యుండును.129-వ పటమునం దిట్టివిత్తులు చూపఁబడి యున్నవి. విత్తనములమీఁద నుండు వెండ్రుకలును విత్తనములు చెదరుట కుపయుక్తమగు సాధనములె. 130-వ పటమునందుఁ జూపఁబ

డిన విత్తునం దుండునట్లును, 124, 125-వ పటములందుఁ జూపఁబడిన కాయయం దుండునట్లును వెంట్రుకలుండిన పక్షమున నివి సులువుగాఁ జెదఱిపోవును గదా !

---

## 10-వ అధ్యాయము.

### విత్తు మొలచుటయు, అది పెరుగువిధమును.



విత్తనములయొక్క లోపలి నిర్మాణమును జూచిన, నవి బహుసూక్ష్మమైన చిన్న మొలకను లోపల నుంచుకొని యుండునట్టి గొరలనియె చెప్పవచ్చును. విత్తనములు ముదిరిన పిదప నెండిపోవును. లోపలనుండు గర్భమును స్తంభించి యుండును. తడిలేక యెండియుండు నంతవఱకు విత్తనములు చెడకయుండును. విత్తనము తడిగానుండినయెడల శీఘ్రము గాఁ జెడిపోవును. కాఁబట్టి రైతులు విత్తనాలధాన్యమును పలుమా ఱెండఁబెట్టి చేర్చిపెట్టెదరు.

విత్తనము లెండువిగా నుండునంతవఱకు మొలవనేరవు. తడి తగిలి నానఁగానె మొలకలెత్తును. ఎండియున్నను, విత్తులు కొన్ని త్వరలోనే చెడిపోవును; కొన్ని బహుదినములవఱకుఁ జెడకయుండును. వడ్లు, రాగులు, వీనివంటి విత్తనాల ధాన్య

ములు రెండుమూడు సంవత్సరములవఱకుఁ బ్రాఁతవడక యుండును. ఆమీఁదట నుంచియున్న, వాని నుండి మొలకలు సరిగా మొలవవు. చిక్కుడు, పటాని, కందులు మొదలగు కాయధాన్యముల విత్తనములు బహుకాలము చెడకయుండ నేరవు. చింత, పొన్న, బ్రాటి మొదలగువాని విత్తనములు చాలాదినములు ప్రాఁతగిలని స్వభావము గలవి.



131-వ పటము.—బాడిసె విత్తనమును గాజుకుప్పెయందు మొలవవేయుట.

విత్తనము భూమిలోపల నుండుటవలన, మొలకలు విత్తనంబులనుండి వెలుపలికి వచ్చువిధమును, దీనికి సంబంధించిన యితర విషయములును మనకుఁ దెలియునవి కావు. మన మీ విషయముల నెఱుఁగఁ గోరితిమేని, మనకంటి యెదుటనె కొన్ని విత్తనములను మొలిపించి, వానిని జూచి యీ విషయముఁ దెలిసి కొనవచ్చును. అట్లు చేయుటకు బాడిసె విత్తు తగిన విత్తు. మనము కిరసనాయిలు దీపముమీఁద నుంచెడి "చిమ్ని" యను గాజు గొట్టము దీనిని మొలవవేయుటకుఁ దగిన సాధనము. కంబలి తునుకలను దడిపి, యీ తడి యారకుం

డునట్లుంచి వానిలో విత్తనంబు లుంచినట్లైన నవి మొలచును. అప్పుడప్పు డెత్తి చూచుటకును వీలగును. అటుగాక పెట్టె యొకటిచేసి, యొకప్రక్కన పలకకు బదులుగా నద్దమువేసి బిగించి యద్దమునకు దగ్గర విత్తనములు నాటినను మొలక లెత్తుటయు, అవి పెరుగుటయు మనకుఁ దెలియును.

బాడిసె విత్తనము నొక దినమంతయు నీటిలో నానఁ బెట్టి పిదప వానినొక గాజుగొట్టములో నుంచి గాలి, వేడిమి సోఁకునట్లు చీఁకటైన చోటనుంచిన నా విత్తనంబులు మొలచును. ఒక కాగితమును గొట్టమువలెఁ జుట్టి దానినిండుగ అంపపుకోత పొడిని పోసి దానిని జిమ్నిలోపల దూర్చి నీరుపోసి తడిపి విత్తనమును కాకితమునకును గాజుగొట్టమునకును నడుమను 131-వ పటమునందుఁ జూపఁబడినట్లుంచిన యెడల మొలకెత్తుట సులువుగాఁ దెలియును.

మొట్టమొదట విత్తనముయొక్క చారకుఁ బైఁగా బీజత్వక్కునం దొక చీలిక యేర్పడును. మొలకయొక్క పై భాగము బయటికి వచ్చును. ఈలాగు వచ్చు మొలకయొక్క క్రిందిభాగం బెప్పుడును భూమిని వెదకుకొని యావైపునకు పోవును. విత్తనంబు నేవిధంబుగా నుంచినను మొలకయొక్క క్రిందిభాగము భూమివైపునకుఁ బెరుగుచుఁ బోవును. 131-వ

పటమునందు నడ్డపుగొట్టములోఁ గ్రిందఁ గనఁబఱచియుండు వి త్తనంబును, 132-వ పటమునందుఁ గనఁబఱచి యున్నట్టి మొదటిది రెండవదియగు విత్తనంబులు నిడివిగా నుంచియుండుటను మొలకయొక్క క్రిందికొన భూమిని వెదకుకొని యావైపునకుఁ బెఱుగుటను జూడుఁడు. గొట్టమునందు మీఁదఁ గనఁబడు విత్తనంబును, 132-వ పటమునందు మూడవవిత్తు నడ్డముగా నుంచియుండినను మొలకయొక్క క్రిందికొన భూమివైపుగాఁ బెరిగిపోవుటయు బాగుగాఁ దెలియుచున్నది గదా. 132-వ పట




132-వ పటము.—బాడిసె విత్తనము.

1. రెండుదినములు గడచిన యంకురము. 2, 3, 4. ఇవి నాలుగు దినములక్రింద మొలచిన యంకురములు. 5. ఒక యంకురదళము తీసిన యంకురము.

మునందుఁ జూపించిన నాలవవిత్తనంబునందు మొలకయొక్క క్రిందిభాగము భూమిలోఁ జొచ్చుటకే రెండుమూడు మాఱులు వంగియున్నది. విత్తనము రెండుమూడు మాఱులు త్రిప్పిపెట్టఁబడినను మొలకయొక్క క్రిందికొన భూమివైపునకుఁ బోవుటకై వంపులు తిరిగియున్నది. ఎన్నిమాఱు లేవిధంబుగా మార్చిపెట్టినను మొలకయొక్క క్రిందికొన భూమివైపునకే పోవుచుండును. మొలకక్రిందిభాగమం దుండు పదునైన కొన విఱిగినయెడల దానికిఁ బిదప మొలక భూమివైపునకుఁ బెరుగుట మానుకొనును. గొప్ప వృక్షములు, చెట్లు వీనియొక్క వేళ్లయం దుండు లేఁత వేరుల కొనలు భూమిపార్శ్వంబుగానే పోవును. వేరుల కీశక్తి యుండుట మిగుల నావశ్యకమే. చెట్ల యొక్క వృద్ధికి సహాయపడుటకై యీశక్తి వేరులకు నుండవలయును. అంకురము యొక్క క్రిందిదంటు నిడివియై పెరిగి పెద్దదికాఁగానే, యంకుర దళములలోనుండు నంకురము యొక్క పై భాగము పెరుగ నారంభించును. అంకురము యొక్క క్రిందిదంటు భూమివైపునకు పోవునట్లె పైదంటు భూమిని వదలి వెలుతురును గాలిని వెదకుకొని మీఁదికి నిడివిగాఁ బెరుగును.

132-వ పటమునందయిదవదిగాఁ జూపఁబడియుండు దానిలో నంకురదళంబు లంకురముయొక్క దంటుతో నంటుకొని

యుండు విధంబును, అంకురముయొక్క పైదంటును గ్రిందిదం టును బాగుగాఁ గనఁబడుచున్నవి. అంకురదళంబునందు దంటు చేరియుండు స్థానంబునకుఁ గ్రిందుగానుండునది మొలకయొక్క క్రిందిభాగము, అనఁగాఁ గ్రిందిదంటు. బీజదళంబునకుఁ బైనుండు నది యంకురముయొక్క పైదంటు. అంకురముయొక్క పైదం టునందు మృదువైన రెండు లేఁతాకులు ముకుళించికొని యుండుటను జూడుఁడు.

బాడిసె విత్తనంబులనయినను లేక తక్కిన యేవిత్తనం బునైనను భూమియందు నాఁటి నీటిని జల్లుచుండునెడల, నాలుగైదు దినంబులకు వెనుక మొలకలు వలయమువలెనుండి భూమిని బెకలించుకొని పైకి లేచును. ఈ వలయమువలె నుండు భాగము అంకురముయొక్క క్రిందిదంటె. ఈలాగు వలయముగా నుండుట మొలక భూమిని బెకలించుకొని వచ్చుటకు ననుకూల ము. ఈ వలయము కొంతకొంత నిడివియై, దాని కాళ్లలో నొకటి భూమియందు నిలఁబడి, రెండవది యంకురదళంబులతోఁ జేరి భూమిని విడిచి పైకిలేచి పెరుగును. ఈలాగు పెరుగుటచేతఁ గ్రిందిదంటును, బైదంటును నొక్క భాగంబువలె నిడివిగా నగును. నేల గట్టిదిగానుండిన యెడల బీజత్వక్కు భూమి యందే నిలిచిపోవును. నేలగట్టిదిగాక మెత్తనయిన యెడల, అం కురదళంబులతోఁ ద్వక్కు అంటుకొని యా దళంబులు విరి

యునప్పుడు రాలి పోవును. అంకురదళంబులు విరిసిన తోడనే, యంకురముయొక్క పైదంటు పెరిగి నిడివియగును. అంకురముయొక్క క్రిందిదంటునుండి వేళ్లు మెండుగఁ గలుగుటచేత భూమియందుండి జలంబు చెట్టునకుఁ బాఱును. మొలక పెరుగుటకుఁ గావలసిన యాహార పదార్థంబు లంకురదళంబులలోఁ జేర్పఁబడి యుండుటచేత నది కడువడిగాఁ బెరిగి పచ్చని యాకులను వేయుచున్నది. ఆకులు పుట్టి పెరుగను బెరుగను, అంకుర దళంబులు కృశించి ముడుచుకొనుచు వచ్చును. ఆకులు పుట్టిన తోడనే యవి తమ యాహార పదార్థములను గలుగఁ జేసికొనును గనుక, మొలకలకు నాహార పదార్థము లంకురదళములలో నైనను, అంకురచ్ఛదనములలో నైనను నుండుట యాకులు కలుగు నంతవఱకే.

బాడిసె మొలకయందు నంకుర దళంబులకు వెనుకఁ గలిగెడు మొదటి యాకుల జత సాధారణమైన యాకుల కంటె భిన్నముగా నుండును. మొదటఁ గలుగునట్టి యాకుల జత సామాన్య పత్రము గల్గినది. దీనికి పిదపఁ గలుగునట్టి యాకుల పత్రములు మూడు చిఱుతయాకులుగా భాగింపఁబడియుండును. భిన్న పత్రంబులుగల యాకులు వేసెడు కొన్ని చెట్లయొక్క యంకురములందు మొట్టమొదటఁ బుట్టునట్టి

యాకులు వెనుకఁ బుట్టువానివలె నుండక భిన్నముగానుండుట




133-వ పటము.—దోసవిత్తనమును, అంకురములును.

1. విత్తనము. 2. లేఁత మొలక. (మొలకలోని యంకుర దళములు విత్తనము లోపలనే నిల్చిపోయి యున్నవి. వేళ్ల రోమములను జూడుఁడు.) 3. పెరిగిన మొలక. (దీనిలోపలి యంకురదళములు నడిమి దంటునం దున్న యొక బుడిపియొక్క యాదరువువలన విత్తనముయొక్క పెంకును విడిచి బయటికి వచ్చియున్నవి.) 4. దంటునందలి బుడిపి. (ఈ బుడిపి విత్తనము యొక్క క్రింది పెంకును చీలగొట్టినట్లదిమి పట్టుకొని యుండుటను పెరిగిన మొలకలలోఁ (3) జూడుఁడు.)

కలదు. ఇట్టి భేదములేక, మొదటనుండి యొకతీరుననే యాకులు వేయుటను గొన్ని చెట్లలో మనము చూడవచ్చును. ఉదాహరణము;—చింత మొలక. చింతవిత్తనముయొక్క యంకుర దళములందు మొదటను వెనుకను వేయునట్టి యాకు లొక్క తీరుననే యుండును. తఱచుగా సామాన్య పత్రములుగల మొలకలం దిట్టి భేదములుగానం బడవు.



134- వ పటము.—దోస మొలక.
(దీనియంకురదళము లాకులం బోలి యుండుటను జూడుఁడు.)

ద్వ్యంకురదళ బీజములు మొలచుట యించుమించుగా బాడిసె విత్తనము మొలచుటను బోలియున్నను, కొన్ని విషయములలో భేదములు మాత్ర మున్నవి. కాఁబట్టి మఱి కొన్ని విత్తనములు మొలచు పద్ధతినిగూర్చి చర్చించి తెలిసికొనుట మంచిది. గుమ్మడి, దోస, నక్కదోస వీని మొలకలం దంకురదళము లాకులవలెఁ బెరుగుచున్నవి. ఈ విత్తనములలో మొలక వెలువడు మొన కూచి

గానుండును. అంకురపు క్రింది దంటు కూచియైన మొననుండి బయటికి వచ్చి పెరుగును. ఈ క్రింది దంటు పెరుగుచు రాఁగా, విత్తనముయొక్క కూచియైన మొనకు దగ్గఱగా నొక బుడిపి యేర్పడుచున్నది. ఈ బుడిపి విత్తుయొక్క పై పెంకు నొక ప్రక్కన అనఁగాఁ గ్రిందితట్టున నదిమి పెట్టుచున్నది. లోపల నుండు నంకురదళములు వర్ధిల్లుచుండుటచేఁ బెంకుయొక్క పై భాగము నదిమి పెట్టుచున్నవి. దీనివలనఁ బెంకు పగులుపాఱి, సందు పెద్దదగును. అంకురదళము లాసందుదారిగా బయటికి వచ్చును. విత్తనముయొక్క పెంకు నేలలోపలనే యుండిపోవును. మొలకయొక్క దంటునందీ బుడిపి పుట్టకపోయిన యెడల, పై పెంకునందు సందియ్యదు. అంకురదళములు వెలుపలికిరాక లోపలనే యుండును.

గంగరావి విత్తులు, ఆముదాలు వీనిలో నంకురచ్ఛదనములుండుటచే నంకురదళములు లావుగాక యాకులవలె సన్నగానే యున్నవి. గంగరావి విత్తనములలో నంకురదళములు పెక్కు మడుపులు గలవిగాను, ఆముదాలలో నివి మడుపులు లేనివిగాను నుండుట స్వభావము. (101, 120-వ పటములను జూడుఁడు.) మొలక వర్ధిల్లి, యంకురదళములు భూమిలోపలనుండి పైకి రాఁగానే, పసిమి రంగుగలవియగుచున్నవి. వెలుతురు తగులుచు వచ్చిన, నీ యంకురదళములు పెరుగుచు, మిక్కిలి పసిమిని బొంది యాకులవలెనే యగుచున్నవి. అంకు

రచ్ఛదనము లుండుటవలన నంకురదళములు వర్ధిల్లుచున్నవి. ఇయ్యంకురదళములు పెరుగుచుండిన, నంకురచ్ఛదనములు కృశించి ముకుళించుచువచ్చును. అంకురచ్ఛదనములులేని విత్తనములం దాకులు పెరుగుచువచ్చిన, నంకురదళములు క్షీణించి పోవును. అంకురచ్ఛదనముగల విత్తనములలో నంకురదళములు వర్ధిల్లి యాకులవలెఁ బసిమి తిరిగి, యాకులుచేయుపనిని జేయఁ దామె మొదలుపెట్టుచున్నవి.

పొన్న, మామిడి వీని విత్తులు ద్వ్యంకురదళ వంతములు. వీని విత్తనములు బీజకోశముయొక్క లోపలి భాగమయిన పెంకును వదలి బయటికి వచ్చుట లేదు. పొన్న, మామిడి ముట్టెలు భూమిలో నాఁటుకోనఁగానే యొక ప్రక్కఁ గొంచెము చీలిక గలుగును. ఇట్లేర్పడిన చీలికనుండి మొలకయొక్క క్రింది దంటు మొన బయటికి వచ్చును. ఇది భూమియందుఁ బాదుకొని వేళ్లు పుట్టఁగానే, మొలకయొక్క పైదంటు చీలికగుండా వెలుపలికి వచ్చి, భూమిని పెకలించుకొని పైకి లేచి, పెరుగ నారంభించును. ఆ భాగము భూమిలో నున్నప్పుడు పుడకలాగున నుండును. ఆ మొలక పై దంటు బయట వచ్చిన వెనుకనే, దానియం దాకులు పుట్టుచున్నవి. (135-వ పటమును జూడుఁడు.) విత్తనముల లోపల నుండు నంకురదళ

ములు పెంకును విడిచి బయటికి వచ్చుటే లేదు. అంకురదళము లంకురపుదంటుతో సంబంధపడి యున్నందున, వాని లోపలనుం



135-వ పటము.—పొన్నమొలకలు.

డు నాహార పదార్థములు అంకురపు దంటు లోపలికిఁ బ్రవేశిం చుచున్నవి. మఱియు నంకుర దళములు మిక్కిలి లావుగా నుండుటచేత నాకులు విశేషముగాఁ బుట్టు నంతవఱకు, దంటు తనకుఁ గావలసిన యాహార పదార్థము నంకుర దళములనుండి పొందుచున్నవి. మామిడి, పొన్న వి త్తనములందు మొలక చిన్నదై యున్నందున చీలికనుండి బయటికి వచ్చి, పిదప గొప్ప

దయి, యాకులు వేయును. మామిడి విత్తనమునందు నంకుర దళము లాహార పదార్థములతో నిండి లావై యున్నందున, మొలకయొక్క పై భాగము విఱిగినను, మఱలఁ గ్రొత్త మొలకలు పుట్టును.



136-వ పటము.—మామిడి మొలక.

మిక్కిలి లావుగా నుండని అంకుర దళములు గల విత్తనములలో నీ యంకుర దళములు తఱుచుగా బీజత్వక్కు నుండి బయటికి వచ్చును.

ఏకాంకురదళ బీజములు సాధారణముగా నంకురచ్ఛదన సహితములయి యుండును. ఇంకను నా విత్తనంబులం దంకురదళ మొక్కటియే యుండును. ఈ విత్తులు మొలచు విధము నెఱుఁగుటకు ఈఁతవిత్తు నుదాహరణముగాఁ దీసికొందము.

ఈఁతవిత్తు మొలవ వేసిన తర్వాత భూమిలోపలనే యుండి బహు సావకాశముగా మొలచి వెలుపలికి వచ్చును.

విత్తునందలి సమభాగము యొక్క మధ్యమున నుండు నంకు
రము క్రిందికొన వెలుపలికి వచ్చి, భూమిలోపలికిఁ జొచ్చి లావ



137-వ పటము.—ఈఁత మొలకలు.

గును. అంకురదళము మాత్రము వి_త్తనంబులోపల నుండును.
తక్కినభాగము లన్నియు బయటికి వచ్చును. క్రిందికిఁ బాఱు

నట్టి మొలకయొక్క క్రిందికోన బలిసి నిడివిగాఁ బెరిగి వేళ్లు తన్నఁగానే, మొలకయొక్క పైదంటు పెరుగుచుఁ బుడమిని బెకలించుకొని యొక పుడకవలెఁ బైకి వచ్చును. పిదప నవి యాకులుగా మాఱును. దంటు పొడుగగుటయు, బయటికి వచ్చుటయు మిక్కిలి యాలస్యము. ఈ విత్తనంబునందలి యంకురచ్ఛదనము మిక్కిలి యురిదిగా నున్నను, మొలక పెరుగ నారంభింపఁగానే, యది కరుగుటకు మొదలుపెట్టును. కొన్ని దినములకుఁ బిమ్మట విత్తనంబు లోపలి యంకురచ్ఛదనము సన్ననై తగ్గిపోవును. అంకురచ్ఛదనమునం దుండు నాహార పదార్థ మంకురదళముద్వారా వర్ధిల్లుచున్న మొలక లోనికిఁ బోవును.

ఏకాంకురదళబీజములు రమారమి యీఁత విత్తనము లాగున మొలచును. ఏకాంకురదళ విత్తనములలో నన్నిటియం దును నంకురచ్ఛదన ముండుటచే నంకురదళము విత్తనములలో పలనే నిలిచి యుండును. విత్తుగూడ బయటికి రాక భూమి లోపలనే నిలిచి పోవును.

విత్తనములం దాహారపదార్థము లంకురదళములందైనను, అంకురచ్ఛదనమందైనను జేరియుండును. ఈ యాహార పదార్థములు నీటియందుఁ గరుగని పిండితునుకలుగానైనను

ఆకరుగకుండుట యనుశక్తిగల మఱేపదార్థముగానైన నుం డవచ్చును. విత్తనములు మొలచుటకు నీరు, ప్రాణవాయువు, కొంచెము వేఁడిమి యివి కావలయును. కొన్ని విత్తనములలో నీరెక్కుటకు సాధనములు కొన్ని యేర్పడియున్నవి. బాడిసె విత్తనమునందుండు చార యిట్టి సాధనమె. బీజత్వక్కు చార యుండుచోట సన్నగాను, తక్కినచోట్ల దప్పముగాను నుండును. అంతేకాక, చారయుండు తావునకు సరిగా లోపల నుండు నొకవిధమైన తెల్లనివస్తువు కొంచెముగ నీటిని బీల్చుకొను శక్తి గలదై యున్నది. నీటిలోఁ గరుగని బంకతో నీ చారను మూసిపెట్టినయెడల, చాలాదినములవఱకు నీరు విత్తనములో పలికిఁ బోక యుండును.

విత్తనములు మొలవ నారంభింపఁగానే, విత్తనములో పల నున్న జీవాణు వాహారపదార్థములను గరుగునట్టి పదార్థ ములనుగా మార్చును. ఇట్లు మాఱిన యాహారపదార్థములను మొలక తనయొక్క యభివృద్ధికై యుపయోగించుకొను చున్నది.

మనము భుజించు ధాన్యములలోను, కాయ ధాన్యము లలోను బిండి తునుకలు నిండుగా నున్నవి. ఈ పదార్థము మొలకల యాహారము నిమిత్తము చేర్పఁబడియున్నది.

గడ్డలందును బిండితునుకలు విశేషముగా నుండును; గడ్డలను బాగుగాఁ జివ్వి పాడిచేసి నీటిలోఁ గలిపినట్లయిన, కొంతసేపటికి పిండితునుక లడుగునఁ దెల్లగాఁ జేరును. అరోరూటు పిండి యరోరూటి గడ్డనుండి యెత్తిన పిండితునుకల రాశియె. పిండి తునుకలు గలిగించెడు విత్తనములును, వాని స్వభావమును 14-వ యధ్యాయమునందు వివరముగాఁ జెప్పఁబడును.

---

## 11–వ యధ్యాయము.

### చెట్లయొక్క జాతి విభాగ క్రమము.

---

లోకమునఁ గల చెట్లన్నియుఁ బుష్పించెడు స్థావరములనియు, పుష్పింపని స్థావరములనియు రెండువిధములు. ఇదివఱకు మన మచ్చటచ్చటఁ బ్రస్తాపించుచు వచ్చిన యోషధులన్నియుఁ బుష్పించునవియె. పుట్టగూడు, పాఁచి, బరణాను(Ferns) అనఁబడు ఓషధులు పూఁచునట్టివి కావు. ఇంత పర్యంతము మనము పుష్పించెడు చెట్లను గూర్చియె విశేషముగాఁ బ్రస్తాపించుచు వచ్చితిమి గనుక వీనిని కుటుంబములుగాను, జాతులుగాను, తెగలుగాను విభజించు క్రమముఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నింతము.

ఈ శోధనమువలన వేరులును, వేరువెంట్రుకలును కొన్ని వస్తువు
లను గరఁగునట్లు చేయ శక్తిగలిగి యున్న వని మన మూహింప
వలయును.

నీళ్లు భూమినుండి వేరువెంట్రుకలలోనికిఁ జొచ్చుటకుఁ
గారణ మే మని మనము తెలిసికొనవలయును గదా. ఈ కార
ణము నెఱుఁగుట కొక శోధనచేసి చూడవలయును. ఒక పెద్ద
పాత్రమునందు మంచినీళ్లు పోసి, రెండుప్రక్కల సందులుగల
యొకగొట్టము నొకప్రక్కను సన్నని చర్మముతో మూసి, యా
పిమ్మట దాని నా పాత్రములో నిలఁబెట్టి, యా గొట్టములో
పల పంచదార లేక ఉప్పు విశేషముగాఁ గరఁగియుండు నీటిని
బోయవలయును. ఇట్లు పోసిన కొంతసేపటికి తర్వాత పాత్రము
లోపలనున్న నీటిని బరీక్షించి చూచినయెడల, దానియందు
పంచదార, లేక ఉప్పు ఉండుట తెలియును. మొదట పెద్దపా
త్రమునందుఁ బోయఁబడిన నీటియందు ఉప్పు, పంచదారవంటి
వస్తువు లేకయున్నను, చిన్నగొట్టములోపలఁ గరఁగియున్న పదా
ర్థములు దీనిలో నగుపడుటచేత గొట్టములోపలినుండి సన్నతో
లుద్వారా యీ పదార్థములు దానిలోపలికిఁ బోయి యుండవల
యు నని యూహింపవలసియుండును గదా. ఇంతియకాక, గొట్ట
ములోపల నున్న నీటిని బరీక్షించి చూచినయెడల, దానిలో

ముండున్న దానికంటె పంచదార, లేక, ఉప్పు తక్కువగాను, జలమెక్కువగాను నుండును. అనఁగా గొట్టమునుండి సన్నని చర్మము ద్వారా కొన్నిపదార్థములు అడుగున నున్న పాత్రము లోపలికిఁ బోయినవనియు, పాత్రములో నున్న నీళ్లు కొంచెము గొట్టములోపలికి వచ్చియుండవచ్చుననియు నిర్ధారణ చేయవలయును. ఏవైనను కొన్నివస్తువులు కరఁగుటచేత చిక్కగా నుండు జలమును, సాధారణ జలమును సన్నతోలు లేక దానివంటి యేవస్తువుచేత నయినను వేఱుచేయఁబడి యున్నట్టయిన, చిక్కగానుండు నీటిలోఁ గరఁగిన పదార్థములు ఏవస్తువును గరఁగకయుండు సాధారణ జలములోపలికిని, సాధారణమైన జలము చిక్కని జలములోపలికిఁ బోవుటయు స్వభావమె. భూమిలోపల నుండు జలమును, వేళ్లలోపలనుండు జలమును నిట్టిరీతిగలవి. భూమిలోపలనుండు జలము సాధారణజలమును బోలినది. వేళ్ల లోపల నిల్చియుండు నీరు గొట్టమందుఁ బోయఁబడిన చిక్కని నీళ్లవంటిది. ఈ రెంటికి నడుమనుండు వేరువెండ్రుకలు, వానిలో నుండు జీవాణువు పొరలు ఈ రెండును సన్నతోలుకు సమానములని చెప్పవచ్చును. భూమిలో నుండు జలము వేరువెండ్రుకల గోడలనుండియు, దానితోఁ జేరియుండు జీవాణువు పొరల నుండియు వేరులలోపలికిఁ బోవును. వేరువెండ్రుకలలోపల గరఁగియుండు వస్తువులు పైచెప్పిన గొట్టమున నున్న వస్తు

వులు సన్నతోలునుండి సాధారణ జలముగల పాత్రములో నిక్కి
బోవునట్లు జీవాణువు పొరలగుండాను, వేరువెంట్రుకల గోడల
గుండాను భూమిలోపలి జలముతోఁ గలియవలెను గదా! వేరు
వెంట్రుకలలోని కణములందు జీవాణు వుండుటచే నిదిలోపలనుం
డు నీటినైనను, కరఁగిన వస్తువులనైనను బయటికి రానిచ్చుట
లేదు. బయటనుండి మాత్రమె జలము లోపలికిఁబోవును.

భూమిలోనుండి జలము వేరువెంట్రుకల గుండా వేళ్లలో
నికి పోవుచుండుటచేత బహు శీఘ్రముగా వేళ్లలో జలము నిండి
పోవును. కణములలోను నీరు నిండుచునే వచ్చును. జీవాణువు
మంచి స్థితిలో నున్నంతవఱకును నీళ్లు జలము లోపలికిఁ జొచ్చు
చునే యుండును. అధికముగా జలము వేళ్లనుండి వెలుపలికి
రాదు. ఈ విధముగా నుప్పు మొదలగు వస్తువులు మెండుగాఁ
గరఁగిన చిక్కని నీళ్లుగల కణములకు చుట్టును నీరె విశేషము
గాఁగల కణము లుండును. జలము తగ్గియుండు కణములలోప
లికి వీనిలోపలినుండి జలము పోవుచుండును. ఈ కణములును
తమయం దుండు జలము చిక్కనను పొందఁగానే, తమకు చేరువ
నుండు కణములం దుండుజలము నాకర్షించును. ఈ విధముగానే
పైనుండి క్రిందికిని అనఁగా నాకునుండి వేరువరకును జల మా
కర్షింపఁబడుచున్నది.

ఐరోపా దేశీయులైన యోషధిశాస్త్రవేత్తలు చాలమంది యాకులలో నుండి నీ రావిరియై పోవుటయె నీరెక్కుడుకు ముఖ్యకారణ మని చెప్పుచున్నారు. ఇతర కారణములును నుండ వచ్చును. వాని నన్నిటిని నిచ్చట వివరించుట యనావశ్యకము. నీ రెక్కుడున్నది యనుట మనకుఁ దెలిసినఁ జాలును.

చింత, పొన్న, గంగరావి మొదలగు చెట్లలో నాకులు విశేషముగా నుండుటవలన జలమును మెండుగా నావిరియై పోవుచుండును. ఈ వ్రూఁకులు నీళ్లు నిల్చియుండక యెండి యుండు ప్రదేశములలోనె పెరుగుచున్నవి. కావున నీరు వేరు వెంట్రుకలలోపలికి మాటిమాటికిఁ జెల్లుచునే యుండవలయును. నీరెక్కుడును బహువేగముగానే జరుగుచుండ వలయును. సామాన్యకణములలో నీరు వేగముగా పాఱదు. అధికముగా నీరు చెల్లునిమిత్తమె కొన్నికణములు దారుభాగముగా మాఱుచున్నవి. మఱియు దారువు లావగుటకు సాధనము లేర్పడి యున్నవి. గంట యొక్కటికి 40, లేక 50 అంగుళముల చొప్పున నీళ్లు దారువునందు పాఱుచున్న వని నిర్ధారణ చేయఁబడి యున్నది. వ్రూఁకులలో దారుభాగము ఎక్కువగాక పోయినచో నీళ్లు ఆకులను జెందవు. కావున వ్రూఁకులందు దారువు పెరుగుచునే యుండును. జలము పాఱుట క్రొత్తదారువుగుండానే. పాఁతదా

రువు, చేవ యీ భాగములగుండా నీరెక్కుటయే లేదు. క్రొత్తగాఁ బుట్టిన దారువు మంచిస్థితిలో నున్నంతదాఁకనే, దీని గుండా నీళ్లు పై కెక్కుచుండును. ఈ భాగ మెండినఁ గాని, దీనిలో విషవస్తువులు చేరినఁ గాని, దీనియందు నీ రెక్కుట నిల్చిపోవును. జలము దారువు నందలి క్రొత్త కణముల ద్వారా పాఱుచున్నదని బహుసులభముగా నిరూపింపవచ్చును. ఇట్లు నిండిన పిదపఁ గూడ నీళ్లు వచ్చుచున్న యెడల క్రొత్తగా వచ్చిన నీళ్లు లోపల ముందుచేరియున్న నీటి నదుముచును. ఈ కారణముచేతఁ గొంచెము కొంచెముగా నీళ్లు నడుమనున్న దారువులోనికిఁ బోవును. వేరుయొక్క దారువు ప్రకాండ దారువుతో సంబంధపడి యుండుటవలన దారువునం దంతయు నీరు నిండిపోవును. ప్రకాండదారు మార్గముగా జలము వేగముగాఁ బోయి, యాకులలోపలికిఁ బోవును.

ప్రకాండముగుండా నీరు పైకిఁ బోవుట "నీరెక్కుడు" అని చెప్పుట వాడుక. ఈ నీ రెక్కుడుకు కారణము లనేకములు. ఆకులందుండి జల మావిరి రూపమునఁ జనుటయే ముఖ్యకారణ మని కొందఱు చెప్పుచున్నారు. ఇది ముఖ్యకారణముగాక పోయినను, నీ రెక్కుడుకు నది యొక సాధన మనియెంచవలయును.

ఆకుల కణములలో నున్న నీరు గాలి వీచుటవలనను, వేడిమి వలనను నావిరియై పోవను పోవను నిల్చియుండు జలము చిక్కనిది యౌనుగదా. ఏలయన, జలము మాత్రమె యావిరియై పోవునుగాని, వానిలోఁ గరఁగి యున్న వస్తువులు శేషించియుండును. కాఁబట్టి యాకుల కణములలో నున్న జల మావిరియైపోనుపోను, దానిలోఁ గరఁగియున్న ఉప్పు మొదలగు వస్తువులు పెచ్చు పెరుగుచు వచ్చునుగదా. జీవాణువు నశించిన యెడల, వేళ్లలోనున్న జలమును, కరఁగియుండు వస్తువులును బయటికి వచ్చును.

జీవాణువు మిక్కిలి వింతయైన వస్తువు. ఇది కొన్ని పదార్థములను కణములలోనికిఁ బోనిచ్చును. కొన్నిటిని బోనియ్యదు. ఇంతియకాక, జీవాణువు కణములలో నుండుకొన్ని వస్తువులను గొన్ని వేళలలో వెలువరించును. మఱికొన్ని వేళలలో నదేవస్తువును వెలుపలికి రానీక లోపలనే యుంచుకొనును. ఎప్పుడు వెలుపల రానీయవలసినది, ఎప్పుడు రానీక లోపలనే యుంచుకొనవలసినది యీ జీవాణువే దానిని నిర్ధారణచేసికోఁగలదు. ఈ జీవాణువుసాహాయ్యమువలననే వేరువెంట్రుకలు తమకుఁగావలసిన వస్తువులను మాత్రమే లోపలికిఁ దీసికొనును. నీళ్లలో నక్కరలేని వస్తువెంత విశేషముగానున్నను, దాని

దొలఁగించుటకును, కావలసిన వస్తు వెంత కొంచెముగా నున్నను దానిని గ్రహించుటకును, నీ వేరువెంట్రుకలకు సామర్థ్యముగలదు. జలము వేరువెంట్రుకలలోఁ జొచ్చి, యచ్చటనుండి వల్కలకణములలోనికిఁ బోవును. నీళ్లు మీఁదుమీఁదుగా లోపలికెక్కుచుండుటవలన వల్కల కణము లన్నిటియందును నిండియుండును. ఒక మ్రాఁకునొక్క దండునం దెచ్చట నైనను నొక్కచోట పట్టయంతయు నొలిచివేసినను, పైనున్న కొమ్మలు, ఆకులును వాడక పెరుగుచునే యుండును. పట్టతోఁగూడ దారు భాగమునుగూడఁ జెక్కివేసినచో, మ్రానెండిపోవును. అనేక వృక్షములలో చేవ యుండ వలసినచోటు బొంగుగానున్నను, నీరు పైకెక్కుచు మ్రాఁకు వర్ధిలుచుండుటచేత, పాఁత దారువు నీ రెక్కుటకు నుపయోగపడ దని తెలియుచున్నది.

నీటిపైఁ దేలుచునైనను, నీటిలో మునిఁగియైనను పెరుగు చెట్లలో దారుభాగము విశేషముగా నుండుటలేదు. (215-వ పటము చూడుఁడు.) వీనిలో నన్నింటియందు నీళ్లు వేగముగా లోపలితట్టునఁ బాఱవలసినది లేదు. ఈ చెట్ల కన్ని ప్రక్కల నీళ్లుండుటచేత, నీళ్లు లోపలికిఁ బ్రవేశించి సంచరింపవలసినభాగములు సమీపమైనవిగానే యున్నవి. సాధారణకణము

ల ద్వారా కావలసినంత నీరు లోపలికిఁబోవును. ఇట్టి చెట్లదంటు లలోనుండు మిక్కిలి స్వల్పమగు దారుభాగముగూడ నడుమనే యుండును. ఇట్లు దంటునడుమ దారు వుండుట దంటున కాధారము; నీళ్లు లోపలికిఁ బోవుటకు నుపయుక్తము. ఎక్కువ యిసుకనేలలందును, నీళ్లు కొంచెముగానుండు చోటులందును మొలచి పెరుగు చెట్లలోను దారు వధికముగాఁ గలుగుట లేదు. ఎందుకనఁగా వీనికి దొరకు జలము మిక్కిలి స్వల్పము. ఈ స్వల్పజలమనవసరముగా నావిరయై పోకుండుటకుఁ గావలసిన ముఖాంతరము లీ చెట్లలో నేర్పడియున్నవి. చెట్లు మిక్కిలి చిన్నవిగానే యుండుట, దారువు కొంచెముగానే యుండుటయు నిట్టి ముఖాంతరములు.

భూమిలోపల జలము చేరి మొత్తముగా నుండక సూక్ష్మముగా నిసుక రేణువులందుఁ బొరవలెఁ గ్రమ్ముకొనియుండుటయు, విడువక యెప్పుడును జలము దొరకుచుండుటయు, ఇట్టి జలము చెట్లయొక్క కొమ్మలనుండియు, ఆకులనుండియు ధారాళముగా నావిరియై పోవుచుండుటయు నే చెట్లలో దారువెక్కువగాఁ బెరుగుటకుఁ గారణములుగా నుంటున్నవి.

చెట్టునకుఁ గావలసిన యాహారపదార్థములు నీటియందుఁ గరఁగి ద్రవరూపముతోనైనను, లేక యావిరి రూపముతో

నైనను చెట్టులోపలికిఁ జనునేకాని, వేఱువిధముగా నివి చెట్టు లోఁ బ్రవేశింపవు. నీ రెక్కుడునలన, పైకిఁ బోవుచుండు నీటిలో పల నీవస్తువులు చాలమట్టునకుఁ గలిసియే యుండును.

భూమిలో నిల్చియుండు జలము శుద్ధజలముగాదు. వాన నీళ్లు బహుశుద్ధముగానున్నను, వానికి భూసంబంధము గలుగఁ గానే, భూమిలోపలనున్న యనేక లవణములు దానిలోఁ గరిగి పోవును. వేళ్లు పీల్చునట్టి నీళ్లు ఇట్టివియే. ఇట్టి జలము ఆకుల లోఁజేరి, యచ్చట నావిరిగా మాఱుపాటు నొందఁగానే, జలములోఁ గరఁగియుండిన లవణములు మున్నగు పదార్థములు ఆకులకణములలోనే నిలిచిపోవుచున్నవనియు, ఇట్లు నిలిచియుం డుటచే కణములలో నిల్చిన జలము చిక్కని దగుచున్నదనియు ముందే చెప్పఁబడినది. ఇట్లగుట రెండు పనుల కనుకూలము. ఆ రెండు పను లేవనఁగా:—నీ రెక్కుడున కుపయోగపడుట, చెట్ల యాహారమునకుఁ గావలసిన వస్తువు లాకుల లోపలికిఁ జేరి యచ్చట నిల్చిపోవుట యను నీ రెండే.

ఇట్లు పలువిధములైన లవణము లాకులలోపలికి పై పైన వచ్చుచునే యున్నను, ఇవి యాకులలో నిలిచి యధికమగుటలేదు. అప్పటి కప్పుడు జీవాణు వీ పదార్థములను దా నుపయోగపఱచుకొనుచువచ్చును. అట్లు జీవాణువు వీని నుపయోగపఱ

చుకొనని యెడల, లవణములు మెండుగా నాకులలోఁ జేరును. నీరెక్కుడును నిల్చిపోవును.

ఓషధులు జీవముగలవే యైనను, హారితపత్రరేణువులు గలిగియుండుటచేత, జీవజంతువులనుండి భేదపడుచున్నవనియు, ఆ భేదమేది యన్న నంగారామ్లవాయువు (బొగ్గుపులుసువాయువు), లవణములు, నీళ్లు వీనిని లోపలికిఁ దిసికొని, వీనిని దమకుఁ గావలసిన యాహారపదార్థములనుగా మార్చుకొను శక్తియె యనియు ముందె చెప్పఁబడియున్నది.

హారితపత్రరేణువులు జీవాణువుయొక్క రూపాంతరమె. జీవాణువు మఱొక్క జీవాణువునుండి పుట్టునట్లు హారితపత్ర రేణువులు హారిత పత్రరేణువులనుండి పుట్టుచుండును. ఇవ్విధముగానే జీవాణువులో లీనమయియుండు జీవపరమాణువును జీవపరమాణువునుండియె కలుగుచున్నది. జీవాణువును, దానిలో లీనమయియుండు జీవ పరమాణువును, హారిత పత్రరేణువులును నెక్కువగుట యివి విభజనపొంది, యొక టొకటిగా నేర్పడి వృద్ధి నొందుచుండుటచేతనే.

చెట్లయందు హారిత పత్ర రేణువు లాకులలో విశేషముగానుండుటవలన నవి యాకులకు ముఖ్యాంగములని మన మెంచవలెను. అయినను, హారిత పత్ర రేణువు లాకులలోనే

యుండ వలయునని నిర్బంధము లేదు. వెలుతురు సోఁకునట్లు గా నివి యెచ్చోటనైనను వ్యాపించియున్న యెడలఁ జాలును. జెముడు, నాగదాళి వీనిలో నాకులే కలుగుట లేదు. ప్రకాండమునందలి కొమ్మలదంటులం దంతటను హరిత పత్రరేణువు లున్నవి. సామాన్య వృక్షములలో నాకులందు నడచు కార్యము ఈ చెట్లలో దంటులందే జరుగుచున్నది.

పదుమూడవ యధ్యాయమునందు, ఆకులు హరిత పత్రరేణువులతో నిండిన కణముల సముదాయము లనియు, నివి దప్పముగాక సన్నవియై, వెలికలగా నుండునట్లు నరముల చట్టములచే బిగియింపఁబడి యున్నవనియు, ఇవి పూర్తిగా సన్నివై పులందును త్వక్కుచే లెస్సగా మూయఁబడి యున్నవనియు, ఈ త్వక్కునం దచ్చటచ్చట మిగుల సన్నని రంధ్రము లున్నవనియుఁ దెలిసికొంటిమి. ఆకులందలి నరముల చట్టముల పల్లములలో కణసముదాయములు నిండియున్నవనియుఁ దెలిసికొంటిమి. ఆకులయొక్క నరము లన్నియు నే వసఁగా దంటు నుండి వచ్చి తొడిమల వెనుకటి ప్రక్కగా పత్రములోఁ జొచ్చి పలుకొమ్మలుగా చీలిన కాష్ఠనాళకూర్చములే. వీనిలో ముప్పాతికపాలు దారువు. శణము లావగు నరములందు మాత్రముండును. సన్ననివానియం దుండదు.

నీ రెక్కనువలన వచ్చు జల మాకునరములలోపలికిం జని, యాకునందలి వలచట్టముయొక్క రంధ్రములందుండు కొనలకు వచ్చిచేరుచున్నది. ఈ కొనలకు చుట్టునుండు కణములలోపల నణంగియుండు జీవాణు వంతయుం దనకుం గావలసిన జలమును నరముల కొనలందుండి తీసి కొనుచున్నది. ఆకుయొక్క వెలికిలి భాగము యావత్తునుండి నీరావిరియై పైకింబోవుచునే యుండును. మన మొక చెట్టునుండి కొన్ని రెమ్మలను విఱిచి యట్లె కొంతసే పుంచిన యెడల, అవి వాడి ముడుచుకొని పోవుచున్నవి. దీనికిం గారణము దానియందలి జల మావిరియై పైకిలేచి పోవుటయె. మిక్కిలి యెండిపోక, వాటముగా మాత్ర మున్నప్పు డీ కొమ్మల యడుగుభాగమును జలములో నుంచియున్న యెడల, కొమ్మలు వాడుదల విడిచి తేఱి తల యెత్తుకొనును. ఆకులు పలుదెసలకు వ్యాపించును. చాలసేపు జలము లోపలనే యుంచియున్న యెడల, పాత్రములోపల నుండు జలముకూడ తగ్గిపోవును. ఈ రెండు దృష్టాంతములవలనను, జలము ఆకులలోపలికిం జనుచునే యుండుననియు, అట్లు చనుచుండు జల మావిరిరూపమున వెలువడుచున్న దనియు మన మూహింపవలయును గదా. ఆకులనుండి జల మావిరి రూపముతో వెలువడుట మఱి సులభముగా నిరూపణచేయుటకును సాధ్యపడును.

ఒక పూలతొట్టెలోఁ బెరుగుచుండు నొకచెట్టు నొక



223-వ పటము —

యద్దపు గులోబుతో (అద్దపుపాత్రముతో) మూసియుంచినట్టయిన నాగులోబుయొక్క లోపలి తట్టున నీటిబొట్లగపడును. ఈ నీటిబొట్లు చెట్టునుండి వెలువడి యావిరి రూపము నొందిన జలమె. ఆవిరి రూపమునొందిన యీ జలమె యద్దమును సమీపించిన వెంటనే చల్లదనమువలన జలముగా మారి, బొట్లుబొట్లుగా నచ్చటచ్చట నిల్చియున్నవి.

నీరెక్కడు వలన లోపలికి వచ్చు జలములోఁ గరఁగియుండు వస్తువు లేవి యనఁగా— ఇనుము (Iron), పొటాసియమ్ (Potassium), సోడియమ్ (Sodium), మాగ్నిషియమ్ (Magnesium), పాస్ఫరస్ (Phosphorus), కాల్సియమ్ (Calcium), గంధకము (Sulpher), జలవాయువు (Hydrogen), ప్రాణవాయువు (Oxygen), లవణవాయువు (Nitrogen) మొదలగు ధాతుమిశ్రపదార్థములు. ఈ పదార్థములతోఁ గూడఁ గొన్ని వాయువు లాకులలోపలికిఁ జనుచున్నవి. ఆకు

పత్రత్వక్కులందు పత్రసూక్ష్మరంధ్రము లుండుటచేత నా రంధ్రములగుండా ఆకులలోపలికి వాయువులు చనుచున్నవి. పత్రసూక్ష్మరంధ్రముల గుండానే వాయువు లాకులలోపలికిఁ జనుచున్నవను విషయము బహుసులభముగా నిరూపింపవచ్చును. 223-వ పటమునందుఁ జూపఁబడినట్లు ఒక చేమాకునయినను, లేక, మఱేయాకునైనను బుడ్డిలోనుంచి, తొడిమయొక్క యడుగుభాగమును బాగుగా జలములోపల నిలిపి, పిదప బుడ్డిలోపల నున్నగాలిని వెలుపలికి వంపుగానుండెడి యద్దపుకొళాయి దారిగా బయటి కీడ్చివేయఁగానే, తొడిమ యడుగు భాగమునుండి చిన్న చిన్న బుడబుడలు వెలువడును. ఆకుయొక్క క్రింది త్వక్కుమీఁదను మైననునుగాని, లేక దానివంటి మఱియేదైన బంకనుగాని పూసి, పిమ్మట కొళాయి మార్గముగా గాలిని వెలుపలికిఁ దీసినను, ఆకుయొక్క తొడిమనుండి వాయువు బుడబుడలుగ వెలువడదు. ఈ కారణమునుబట్టి మనము పత్రత్వక్కునందుండు సూక్ష్మరంధ్రములగుండా వాయువు లాకుల లోపలికిఁ జనుచుండు నని యూహింపవచ్చునుగదా.

ఈ పత్రసూక్ష్మ రంధ్రములదారినే ప్రాణవాయువును, బొగ్గుపులుసువాయువును చెట్లలోపలికిఁ బోవుచున్నవి. జలమును నీ రంధ్రముల దారినే యావిరియై వెలువడుచున్నది. ఈ

రంధ్రములు లేనిచోటనుగూడ జల మావిరిరూపమున వెలువడు చునుండును. అయితే, పత్రసూక్ష్మరంధ్రిముల ద్వారా జలమావిరి రూపమున విశేషముగా వెలునడును. ఈ పత్రసూక్ష్మ రంధ్రములగుండానే ప్రాణవాయువును, అంగారామ్ల వాయువును వెలువడుటయుఁగలదు.

ప్రాణవాయువు వెలుపలికి వచ్చుటను మిక్కిలి సులభముగా నిరూపింపవచ్చును. 224-వ పటమునందుఁ జూపఁబడిన గ్లాసు యద్దపుపాత్రయందు జలముపోసి దానియందు కొంచెము తీఁగపాఁచి నడుగుననుంచి దానిమీఁద నొకయద్దపు పొన్నలు మూసిపెట్టి, యా పొన్నలు గొట్టముపైన జలముతో నిండిన నొకయద్దపు గొట్టమును మూసి



224-వ పటము.—

యెండలోఁ బెట్టినయెడల, కొన్ని గడియలకంత తీఁగపాఁచినుండి చిన్న చిన్న బుడబుడలు లేచి, పైకి పోవుచుండును. ఆగొట్టము కూడ జలముచే నిండును. ఎండ యెక్కువగా నున్నయెడల బుడబుడలు వేగముగా నొకదాని వెంబడి మఱియొక్కటి వచ్చుచునేయుండును. వెలుతురు తగ్గినయెడల బుడబుడలు తగ్గును. చీఁకటియైన చోట బుడబుడలె పుట్ట

వు. మఱియు నీటిని మసలఁగాచి, గాలి తగుల కుండులాగున నారఁబెట్టి, దానిలో పాఁచి నుంచిన పిదప, ఎండలోఁబెట్టినను బుడబుడలు లేవవు. ఇదే జలమునందు బొగ్గుపులుసు వాయువును బోనిచ్చి, బాగుగాఁ గులకరించి, పిదప పాఁచిని నాపాత్ర మం దుంచి యెండలోఁబెట్టినయెడల బుడబుడలు పుట్టును. గొట్టములోపలఁ జేరియుండు గాలి నిప్పుమీఁదఁ దగిలినదే, యా నిప్పు మండుట కారంభించినచో, నది ప్రాణవాయు వని చెప్ప వలయును. నిప్పు బాగుగా మండునట్లు చేయుట ప్రాణవాయువుయొక్క ముఖ్యగుణము. దీపము మొదలగునవి మండుట ప్రాణవాయువుయొక్క సంబంధమువలననే.

పై వివరించిన శోధనవలన, చెట్లు వెలుతురులో నున్నంతవఱకు వాటినుండి ప్రాణవాయువు వెలువడుచుండుననియు, వెలుతురు లేకపోయినను, అంగారామ్లవాయువులేక పోయినను ప్రాణవాయువు వెలువడుట లేదనియుఁ దెలిసికొనవచ్చునుగదా.

ప్రాణవాయువును, అంగారామ్లవాయువును వెలువడుచుండుటవలన నేవో కొన్ని విశేషచర్య లాకులయందు నడచుచుండునని మన మూహింపవలయును. ఈ చర్య క్రమముగ నడుచుచుండుటకు హరిత పత్రరేణువులును, అంగారామ్లవాయువును, వెలుతురు ననఁ నీ మూఁడువస్తువులు నుండవలయు

ను. ఈ మూటిలో నేదైన నొకటి లేకున్నను, ఈ చర్యలు నడువక నిలిచిపోవును.

ఆకులోపలనుండు కణములకు లవణములు, వాయువు, జలము మొదలగునవి వచ్చుచున్నవియనియు, లవణములు నీ రెక్కుడువలన వచ్చునీటియందుఁ గరఁగియుంటున్న వనియు, ఆ లవణము లిట్టి కరఁగు స్వభావముగలవనియు, వాయువులు రెండే లోపలికిఁ జనుచున్నవనియు ముందే చెప్పఁబడినది.

ఈపదార్థము లన్నియు నాకులకుఁ జేరఁగానె యని య చ్చట వినియోగింపఁబడుచున్నవి. ఈ పదార్థములు యావత్తును ఆకుల కణములం దుండు జీవాణువులోపల వచ్చి చేరఁగానే, జీవాణువుయొక్క మఱియొక రూపమగు హరితపత్రరేణువులు లోపలఁ జేరియుండు పదార్థములలోఁ గొన్నింటిని భిన్నపఱచి, మఱల వానినెల్లఁ జేర్చి, కట్టకడపటఁ బిండితునుకలనుగా మా ర్చివేయుచున్నవి. ఈ పిండితునుకలు గలుగుటకైన చర్యలందే ప్రాణవాయువువెలువడుట యను చర్యయుఁ జేరియున్నది. ఈ పిండితునుకలు హరితపత్రరేణువులకు లోపలనే కలుగుచు న్నవి. మఱియు నీ పిండితునుక లుత్పత్తియగుట మొదలగులు చోట్లలోనే సాధ్యపడుచున్నదనియు, ఆకులందు సూర్యకాంతి

తగులుచోట్లందు మాత్రమే యివి కలుగుచున్నవనియు బహు సులభముగా నిరూపింపవచ్చును.

ఏదైన నొక చెట్టుయొక్క యాకులో నొక భాగమును మాత్రము సన్నని రేకుతో మూసిపెట్టి, మఱి యొకభాగమును వెలుతురుసోఁకున ట్లొకదినముగాని రెండు దినములుగాని యుంచి యుండి, పిమ్మట నాయాకు నెత్తి వేఁడి నీళ్లలోనుంచి దానికిఁ బిదప "అయోడిన్" (Iodine), అను పేరుగల ధాతువుతోఁజేరిన నీటిలో నాయాకును ముంచినట్లయిన, వెలుతురు తగులుచున్న భాగము నల్లనై పోవును. మూసిపెట్టఁ బడియుండిన భాగము తెల్లగానే యుండును. పిండితునుకలు అయోడిన్ అనుదానితో సంబంధపడినతోడనే నల్లనై పోవును. వెలుతురు తగిలిన భాగము నల్లనై పోయినది గనుక నీ భాగమునందు పిండితునుక లున్నట్లు తెలియుచున్నభాగము



225. వ పటము.—ఉరలగడ్డ లోపలనుండు పిండితునుకల పైచూపు. సుమారు 800 రెట్లు పెద్దదిగాఁ జూపఁబడియున్నది.

నల్లనై పోవుటచే, దానియందు మాత్రమె పిండితునుకలు కలుగుచున్నవనియు, వెలుతురు తగులనిభాగమునం దివి కలుగవనియు మన మూహింపవచ్చును. ఇట్లయం దాకులొకదాని నొకటి మరుగుపఱపక వృద్ధి నొందుచుండుట పిండితునుకలు వీనియందుఁ గలుగునిమిత్తమె.

ఆకులందు పిండితునుక లుత్పత్తియగుటకు నడచు చర్యలు బహుముఖ్యములైనవి. ఈ చర్యలు జరుగుటకు వెలుతురు ముఖ్యమగుటచేతను, ఇది సూర్యరశ్మి సోఁకుటవలన జరుగు సంయోగ వ్యాపారముగా నుండుట చేతను, ఈ చర్యకు "దీప్తిజన్యసంయోగవ్యాపారము" అని పేరు పెట్టవచ్చును. ఈ సంయోగ వృత్తియె యాకులయొక్క ప్రధానకార్యము. ఆవృత్తివలనఁ గలుగునట్టి పిండితునుకలే చెట్లయొక్క యాహారమున కాధార మగుచున్నవి.

హారితపత్ర రేణువులలోపలఁ గలుగు నీ పిండితునుకలలోఁ జేరియుండు ధాతువులు బొగ్గు, ప్రాణవాయువు, జలవాయువును. జలవాయువు, ప్రాణవాయువు నను నీ రెండును జలమునుండి వెలువడుచున్నవి. బొగ్గుపులుసువాయువునుండి బొగ్గు వేఱుపఱపఁ బడుచున్నది. అంగారామ్లవాయువు బొగ్గు, ప్రాణవాయువుల సంయోగముచే నేర్పడిన వస్తువు. ఈ బొగ్గుపులుసువాయువును మఱల ధాతువులనుగా వేఱుపఱచుటకు

మిక్కిలి తీక్ష్ణమైన వేఁడిమి ముఖ్యముగాఁ గావలెను. అట్లు వేఱుపఱుచుటకు సాధ్యపడని యీ వాయువును హారిత పత్ర రేణువులు సూర్యకిరణముల సాహాయ్యమువలనఁ బ్రత్యేక ప్రత్యేక ధాతువులనుగా వేఱుపఱుచుచున్నవి. అట్లు వేఱుపడిన వెంటనే హారితపత్రరేణువులు బొగ్గును (Carbon) తా ముప యోగపఱచుకొనుచున్నవి. వేఱుపడిన ప్రాణవాయువు వెలు పలికి వచ్చుచున్నది. నీటిలో నుంచియుండిన తీఁగపాఁచినుండి వెలువడు బుడబుడలె యీ ప్రాణవాయువు.

జీవజంతువులకును, ఓషధులకు నుండు సకల వ్యత్యాస ములును దీప్తిజన్యసంయోగ వ్యాపారమువలనఁ గలుగుచు న్నవి. చెట్లయందు మాత్రమే యీలాటి దీప్తిజన్యసంయోగ వ్యాపారము సులువుగా నడుచుచున్నది గాని, జీవజంతువులలో నిది జరుగుట లేదు. ఇంత దనుకను, ఆకులు ఓషధులకు మిగుల ముఖ్యభాగ మని చెప్పుచు వచ్చినందుకుఁ గారణము మనకుఁ దెల్లమాయెను గదా.

ఆకులు చేయు పను లేవి యని మఱల గమనించి చూ తము. ఆకు వెలుతురును గ్రహించి, దాని నుపయోగపఱచు కొనుట కేర్పడిన సాధనము. జల మావిరియై పోవుటకు వీలగు నట్లు, ఆకు పఱచుకొనినదియు, సన్ననిదియునై యుండున

ట్లమర్పఁబడియున్నది. జల మావిరియై పోవుటచేత దానియందుఁ గరఁగియుండిన కొన్ని లవణము లాకులందే నిల్చిపోవుచున్నవి. అంగారామ్లవాయువును, ప్రాణవాయువును పత్రసూక్ష్మరంధ్రముల మార్గముగా కణములందున్న జీవాణువును బొందుచున్నవి. జీవాణువుయొక్క వేఱురూపమగు హరితపత్రరేణువు లంగారామ్లవాయువునుండి యంగారమును (బొగ్గును) వేఱుపఱచి, వెంటనే యంగారమును, మఱికొన్ని ధాతువులను గ్రహించి, రూపాంతరము నొందించి కడపటఁ బిండితునుకలనుగా మార్చుచున్నవి. ఈ పిండితునుకలు మిక్కిలి చిన్నవి. హరితపత్ర రేణువులలోపలనే యివి యుండునుగాని వెలుపల నుండవు.

సూర్యకాంతి యాకుల కనేకవిధముల నుపయోగపడుచున్నది. ఇది జల మావిరియై చెల్లుటకు మాత్ర ముపయోగపడుటయేకాక, యంగారామ్లవాయు వాకులలోపలికిఁ జని దీప్తిజన్యసంయోగ వ్యాపారము నిరాటంకముగా జరుగుటకును సహాయపడుచున్నది. అంగారామ్లవాయువు పత్రసూక్ష్మరంధ్రములగుండానే యాకులలోపలికిఁ జనుచున్నది. ఈ పత్రసూక్ష్మరంధ్రములు బాగుగాఁ దెఱచుకొని యున్నయెడల, వాయువు నిరాటంకముగా లోపలికిఁ బోవుచున్నది. ఈ రంధ్రములకు రెండుప్రక్కల నుండునట్టి యర్ధచంద్రాకారములున

కావలి కణములలో హరితపత్రరేణువు లున్నవి. సూర్యకాంతి సోఁకినవెంటనే యివి నీటిని బీల్చుటకును, దీప్తిజన్యసంయోగ వ్యాపారము జరుగుటకు నారంభమగును. దీనివలన కావలి కణముల వలయమును నడిమిసందులును బెద్దవగును. సందులు పెద్ద వగుటకు నేర్పడిన సాధనములలో నీ వెలుతు రొక్కటి. ఇంకను నితరసాధనము లుండవచ్చును. అవి యిట్టివి యని యింకను బాగుగఁ గని పెట్టఁబడలేదు.

చెట్లు, చేనులు, తృణములు మొదలగునవి యెల్లను నీ పిండితునుకలనే తమ యాహారముగా లోపలికిఁ గొనుచున్నవి. ప్రాణులును నీ పిండితునుకలనే యుపయోగపఱచుకొనును.

పగలంతయు నాకు లెండలోనే యుండుటచే, వానియందు దీప్తిజన్యసంయోగ వ్యాపారము నడచుచునే యుండును. ప్రకాశము తగ్గఁగానే యీ వ్యాపారమును నిల్చిపోవును. ఈ వ్యాపారమునవలనఁ గలుగు పిండి తునుక లాకుల కణములందే యుండినయెడల, నాకణములలో నితర వ్యాపారము లేవియు నడువవు. ఈ యాటంకనివృత్తికొఱకే జీవాణు వీ పిండితునుకలను పంచదారనుగ మార్చి, తమకుఁ గావలసినది పోను, తక్కిన భాగము నితర ప్రదేశములకుఁ బోనిచ్చుచున్నది. ఇవ్విధముగా నెక్కువ చక్కెర వేరు, దంటు, కాయ, విత్తనములు

నను భాగములకుఁ బోయి, యచ్చట నుండు జీవాణు పూరిత కణములను జెంది, పిండితునుకలుగా నైనను, చక్కరగా నైన ను మాఱియుంటున్నది. ప్రకాండము, వేరు వీని భేదము లగు గడ్డ, మూలవహము, కందము, లశునము మొదలగునవి యెల్ల ను నీ చక్కెర చేరి యుండుటకై యేర్పడిన నిర్మాణములు.

ఆకులలోనుండు జీవాణువు దీప్తిసంన్యాసంయోగవ్యాపార మునే కాక మఱికొన్ని వ్యాపారములను గూడ నడుచునట్లు చే యును. పిండితునుకలు చక్కెరగ మాఱఁగానే, దానితోఁగూడ నీ రెక్కుడువలనఁ బైకెక్కివచ్చు కణములలోనున్న గంధకము (Sulphur), ఫాస్ఫరస్ (Phosphorus), లవణవాయువు (Nitrogen) మొదలగు ధాతువులను కల్పి, దానిని జీవాణు పదార్థముగా నైనను, లేక యితర పదార్థములనుగా నైనను మార్చి తమలోఁ జేర్చి పెట్టుకొనును. జీవాణువునకుఁ గావలసిన లవణవాయువు (Nitrogen) బయట నెచ్చట నుండు గాలిలో నున్నను, అది దానిని గొనక, భూమిలోపలనుండి వచ్చు లవణ ములనుండియె యీలవణవాయువును (Nitrogen) గీల్చుచు న్నది. కొన్ని చెట్లు మాత్రమె భూమిలోపలనుండి వచ్చు లవణ ములలో నీ వాయువు తక్కువగా నుండునెడల, గాలిలోనున్న యీ లవణవాయువును జీల్చుటకుఁ గావలసిన సాధనములను

గలిగియున్నవి. చిక్కుడు, కందికుటుంబములలోని యనేక చెట్లీగుణము గలవి.

పిండితునుకలను జీవాణువుగానైనను, దానిలోఁ జేరి యుండఁదగిన పదార్థముగానైనను మార్చుట యన్నికణముల లో నుండు జీవాణువునకును సాధ్యపడును. ఈ వ్యాపారమున కాకుపచ్చనన్నె యనావశ్యకము. కాఁబట్టి యిట్టి మార్పు ప్రాణులందలి జీవాణువునందును నడచును.

చెట్లయొక్క యభివృద్ధికి నుపయోగపడునది యిట్లు క్రొత్తగాఁ బుట్టునట్టి జీవాణు కణము లెక్కువపడుటయే. అట్లు కణముల సంఖ్య హెచ్చుటకు జీవాణువును హెక్కువ యగుచుండవలయును గదా! జీవాణు వధికపడుట కుపయుక్తమయిన వస్తువు పిండితునుకలయొక్క మార్పుదలవలనఁ గలిగెడునది.

ఓషధు లందలి యాకులలో జీవాణువు నిండియుండుట వలనను, వీనియందు దీప్తిజన్యసంయోగ వ్యాపారము నడచుట వలనను, తక్కిన ధాతువులతో మిశ్రమయియుండు పదార్థములు నీ రెక్కుడుతోఁ గూడ వచ్చి యాకుల కణములలోఁ జేరుటవలనను, జీవాణుపదార్థసంపాదనవ్యాపారమును నాకునందు నిల్చియుండు జీవాణువునందే జరుగుచున్నది. ఇతర స్థలము

లందున్న జీవాణువునందును నీ వ్యాపారము జరుగవచ్చును. అయినను, ఆకులందే యీ వ్యాపార మధికముగాను, కడు వేగిరంబుగాను జరుగుచున్నది. పిండితునుకలు పలుతావులకుఁ బోయి నిల్చునట్లె, జీవాణు పదార్థము లాకులందుఁగలిగినతో డనే జల్లెడ గొట్టములద్వారా కావలసిన తావులకుఁ బోయి చేరుచున్నవి. ముఖ్యముగా పెరిగెడు తావులకుఁ బోవును. దీప్తి జన్యసంయోగవ్యాపారమునకుఁ గావలసిన శక్తిని జీవాణువు సూర్యకిరణములనుండి పొందుచున్నది. జీవాణుపదార్థ సంపా దనమునకును ననేక ధాతువులు సంయోగపఱుపవలసియుండుట వలన దీనికి శక్తిగావలసి యున్నది గదా. ఈ శక్తికి జీవాణువే యాధారము. అంగారామ్లవాయువు లోపలికిఁ జనునట్లు, ప్రాణ వాయువును పత్రసూక్ష్మ రంధ్రముల మార్గమున లోపలికిఁ జనునని మున్నె చెప్పఁబడినది. ఈ వాయువు జీవాణువునందలి కొన్నిభాగములతోఁ గలిసి, దానిని దహించివేయును. ఇట్లు చేయుటవలనఁ గొంచెము శక్తి గలుగును. జీవాణు వీశక్తిని నూతన జీవాణుసృష్టికై యుపయోగపఱచుకొనుచున్నది. ముం దున్న జీవాణువు కొంచెము క్షీణించినను, నూతనముగాఁ బుట్టు జీవాణుభాగమెక్కువగా నుండును. శక్తిని బయలుపఱచు నిమి త్తము ప్రాణవాయువు జీవాణువుతో సంయోగము నొంది దా నిని నానావిధవస్తువులనుగా విభాగించును. ఇట్లు కలిగిన వస్తు

వులలో ముఖ్యమైనవి జలమును, అంగారామ్ల వాయువును. ఉష్ణమును స్వల్పముగాఁ బుట్టును. ఉష్ణము జలమును, అంగా రామ్లవాయువును చెట్లనుండి వెలువరించును. ఈ చర్య యెల్ల ప్పుడును చెట్లలో నడచుచునే యుండును. దీనికి రాత్రిపగ లను భేదము లేదు.

ప్రాణులును, చెట్లును తాము సకల కార్యములఁ జేయఁ గలుగుటయును, వృద్ధిఁబొందుటయును ప్రాణవాయువు జీవాణు వుతో సంబంధపడియుండుటచేతనే కలుగుచున్నవి. ప్రాణవా యువు లేని యెడల జీవాణువు స్తంభించి కార్యమును జేయక యుండును. ప్రాణవాయువు రానియెడల జీవాణువు క్షీణించినను క్షీణించి పోవును.

ఎండు విత్తనాలలో నుండు జీవాణువు స్తంభించియుం డును. విత్తనములకు నీటి సంబంధము గలుగఁగానే, జీవాణు వుతోఁ బ్రాణవాయువు సంయోగపడును. అంగారామ్లవా యువు వెలువడుటవలనను, మొలకలో నుష్ణము విశేషముగాఁ గలుగుటవలనను ప్రాణవాయువు సంయోగము కలుగుచున్నదని మన మూహింపవచ్చును. రైతులు నాట్నమునకు మునుపె వడ్లునానఁబోసి, చల్లకమునకు మునుపే మొలక లెత్తునట్లు చేయుచున్నారు గదా. విత్తు మొలక లెత్తునప్పుడు చూచిన

యెడల నావిరి వెడలుట మనకుఁ దెలిసిన విషయమే. ఈ యుష్ణమునకుఁ గారణము ప్రాణవాయుసంయోగమే. ప్రాణులశరీరములును నుష్ణముగా నుండుట ప్రాణవాయు సంయోగము వల



226-వ పటము.—పుట్టగొడుగు.

ననె. వేగిరముగాఁ బని జరుగు తావులం దెల్ల ప్రాణవాయు సంయోగ మధికము. తామరపూవులు పూఁచునప్పుడును, విత్తనములు మొలచునప్పుడును నుష్ణము మెండుగా నుండును.

ప్రాణవాయుసంయోగము జీవాణువు చక్కని స్థితిలో నుండు నంతవఱకును నడచుచునే యుండును. ఇట్లు ప్రాణవాయు సంయోగము నడచునంతవఱకును ప్రాణ మున్నదని చెప్పవచ్చు

ను. ఇది నిలిచిపోయినయెడలఁ బ్రాణము పోవును. అనఁగా జీవాణువు స్తంభించును. చేష్టలును నడవవు. చిరకాలము ప్రాణవాయు సంబంధము లేనిచో జీవాణువు చెడును. జీవాణువు బొత్తిగా చెడిపోవుటయే మరణము.



227-వ పటము — పుట్టగొడుగు.

హరిత పత్రరేణువులు లేని చెట్లును ననేకములు గలవు. పిండితనుకలను గలిగించుకొను శక్తి వీనికి లేనేలేదు. ఇతర వృక్ష

ములంనుండి యైనను, జంతువులందుండియైనను పిండితునుకల నుగాని, లేక జీవాణువువంటి వస్తువులను గాని పొందియె యీ చెట్లు వర్ధిల్లుచున్నవి. (226, 227-వ పటములను జూడుఁడు.) పుట్టగొడుగు చెట్టు ఈ తెగలోఁ జేరినది. దీని కాహారమును బెట్ట నితర చెట్లులైనను, జంతువులైనను, వానియంగములైనను వీనియందుండవలెను. బదనిక తన కాహారముపెట్టు చెట్ల మీఁదనే వృద్ధి నొందుచున్నవని ముందె చెప్పఁబడినదిగదా. ఈ చెట్లయందు దాకు లుండుటచే దీప్తిజన్యసంయోగ వ్యాపారము నడుచును; పిండితునుకలును గలుగును. నీటిని మాత్రము భూమినుండి తామె పీల్చుకొనక, తమ కాహారము పెట్టు చెట్లయొక్క కొమ్మలద్వారా పీల్చుచున్నవి.

చెట్లలో జీవాణువస్తువు గలుగుటకు ముఖ్యముగాఁ గావలసిన వస్తువు లవణవాయు వనియు, ఆలవణవాయువు బయట సంచరించు గాలిలోఁ గలిసియున్నను, చెట్లు గాలినుండి యీ లవణవాయువును బీల్చుకొనక, భూమినుండి తమ లోపలికిఁ జొచ్చు జలమునందుఁ గరఁగియుండు లవణములనుండియె యీ లవణవాయువును గ్రహించుచున్నవనియుఁ బూర్వమె చెప్పఁబడినది గదా. ఈ వాయుసంబంధము గల్గియుండు వస్తువులు స్వల్పముగానుండు తావులందుఁ బెరుగుటచేతనో, లేక, మఱియేకారణ

ముచేతనో కొన్ని చెట్లు లవణవాయువుతోఁ గలిసియున్న పదార్థములను జీవముగల పురుగు పుట్రలు, తుమ్మెదలు మొదలగు వానినుండి కైకొనుచున్నవి. అనఁగా, కొన్ని చెట్లు పురుగు పుట్రలను నాహారముగా నుపయోగించుకొనుచున్నవి. ఈ తెగచెట్లకు "కీటభక్షకసస్యములు" లేక "కీటఖాదములు" అని పేరు పెట్టవచ్చును. (ఈ పేరునకు పురుగులఁ దినునవి యని యర్థము.)



228-వ పటము.—
"డ్రోసిరాబర్మన్నె."
(Droseara Burmanni.)



229-వ పటము.—
"డ్రోసిరా ఇండికా."
(Droseara indica.)

మనరాజధా న్యంతర్గత ప్రాంతములలో నిట్టి కీటఖాద ము లనేకము లున్నవి. ఇవి ప్రాయముగా నుపయోగపడని చిన్న చెట్లుగా నుండుటంబట్టి మనవా రీ చెట్లను గమనింపనే లేదు. కావుననే వీటికిఁ బేరులును లేవు.

జవుకునేలలలో 228, 229-వ పటములందుఁ జూపఁబడిన రెండు తెగల చెట్లు పుట్టి పెరుగుచున్నవి. వానిలో మొదటఁ జూపఁబడిన చెట్టునం దాకు లన్నియుఁ జేరి గుంపుగా నేల కంటు కొనియుండును. పూలకంకి మాత్రము పైకిఁ బెరుగుచున్నది. రెండవ దానియం దాకు లొంటరిచేరిక గలవి. ఈ రెంటియందును నాకులందు నిడుపాటి రోమము లున్నవి. చెట్లు జీవించియున్నప్పుడు, ఈరోమముల కొనలందు ముత్యమునంటి జిగటగల నీటిబొట్లుంటునే యుండును. ఏమఱుపాటున నేదైన పురుగు పుట్రలీ చెట్ల యాకులపై వాలిన నవి వానికి నంటుకొనిపోవును. పురుగు తప్పించుకొనిపోవఁ బ్రయత్నపడునప్పుడు, ఆకులు తమ యందున్న రోమముల కొనలందుండు జిగట వస్తు వా పురుగు నకు సోఁకునట్లు ముడుచుకొనును. ఆరోమముల కొనలలో జిగట విశేషముగా నుండుటవలన నా పురుగు తప్పించుకొని పోఁజాలదు. ఈ చెట్లీ విధముగాఁ జిక్కిన పురుగులమాంస మును దమ కాహారముగా నుపయోగించు కొనుచున్నవి.

కీటఖాదములగు చెట్లలో మఱియొక తెగచెట్టు 230-వ పటమునందుఁ జూపఁబడియున్నది. ఈ చెట్టునందుఁ బురుగును జంపుట కేర్పడియుండు నుపాయము వింతయైనది. ఆకులకొనలందుఁ గాన్పించు గిన్నెలె యివి. ఈ గిన్నెలవంటి యాకులలో నెప్పుడును నీళ్లుండును. పైతట్టున దీనినోటియోర సాగసుగాను జిగటగలదిగాను నుండును. అక్కడఁ బంచదారతోఁ గలిసిన నీరైనను, తేనెయైనను బుట్టుచునే యుండును. దానికి సువాసనయుఁ గలదు. ఈ సువాసనను గోరివచ్చు పురుగు లీ నీటిలోఁ బడి చచ్చుచున్నవి. ఇట్లు చచ్చిన పురుగుల మాంసమును జెట్లు తమ కాహారముగా నుపయోగించుకొనుచున్నవి.

చెట్ల యవయవములందు నడచు చర్య లేవి యని నిదానించి చూతము.

వేళ్లు భూమిలో నుండు జలమును బీల్చుచున్నవి. ఎల్లప్పుడును నీళ్లు చెట్ల కెక్కుచుండవలయును గనుక, క్రొత్తవేళ్లు పుట్టుచునేయుండును. జలమును లోపలికిఁ బీల్చుకొనుట వేరు వెంట్రుకలయొక్క పని. కొన్ని చెట్లయం దీ వేళ్లు నీటిని బీల్చుట యను పని చేయుటయేకాక, యాహారపదార్థములను జేర్చి పెట్టఁదగిన కణజములుగాఁగూడ నుపయోగపడుచున్నవి.

వేళ్ల వెంబడి భాగమగు దంటులయొక్క కార్యము ఆకులను, కాయలను మోయుటయు, దారు భాగమును బొంది

దాని మూలముగా నీటిని పై భాగములకుఁ బోనిచ్చుటయునై యున్నది.



230-వ పటము.—"నిబందీస్."

ఆకులందు నడచు పనులు దీప్తిజన్యసంయోగవ్యాపారము, జీవాణుపదార్థ సంగ్రహము ననునవియె. ఆకులనుండి జలమావిరియైపోవుట, అంగారామ్లవాయువు లోపలికిఁ జొచ్చుట మొదలగు వ్యాపారములు పైఁ జెప్పిన వ్యాపారముల కనుకూ

లమైనవి. లవణము, వాయువు, జలము మొదలగు సామాన్య వస్తువులఁగొని, వీనినుండి యాహారయోగ్య పదార్థముల నుత్పత్తిచేసికొనుట, ఆహారపదార్థమును జీవాణుపదార్థముగా మార్చుటయనునివి గూడ నాకులందు నడచుకార్యములు.

చెట్ల యవయవములు వృద్ధినొందుటకుఁ గావలసిన పదార్థములు జీవాణువుతోడ్పాటువలనఁ గలుగుచున్నవి. జీవాణువు చెట్లభాగములగు కణముల గోడలుగాను, నిలువచేసియుంచుకొనఁదగిన పిండితునుకలుగాను, చమురుగాను, చక్కెరగాను మాఱుటకుఁ దగిన శక్తిని ప్రాణవాయు సంయోగమువలనఁ బొందుచున్నది. ముందుగాఁ జేరియుండు ప్రాణవాయువు దీనికిఁ బనికిరాదు. అయినను, గాలిలోనుండు ప్రాణవాయువే దీని కావశ్యమైనది. పువ్వుల కార్యమేమనఁగా, పువ్వు లండాశయముగలవై, గర్భాధానయోగ్య సాధనములు గలిగి, విత్తనములఁ బుట్టించుట కై యున్నది.

---



పరిభాషాపదముల వివరణము.

(అకారాది)

అంకురచ్ఛదనము (Endosperm)—కొన్ని విత్తనములలో సంసరమును మూసికొని, యంకురమున కాహారముగా నుపయోగించుభాగము. 150. 119 * 120.*

అంకురదళములు (Cotyledons)—విత్తనముల లోపలనుండు సంపుటములతోఁగూడఁ జేరియుండు దళసరియైన ఆకులు. 157. 117* 118.* 119.*

అంటుమొగ్గలు (Adventitious bud)—కణుపు సందులందుఁ గాక తక్కిన తావులందుఁ బుట్టునట్టి మొగ్గలు. 55. 34.*

అంటువేరు (Adventitious root)—ప్రకాండముయొక్క నంటులందుఁ బుట్టువేరు. 26.

అంటుచెట్టు (Epiphyte)—భూమిలోపలఁ బొఱఁబడక బయటనే గాలి సోఁకునట్లుగానుండు వేళ్లుగలచెట్టు. 28, 29. 11 *, 12*.

అండకోశము (Gynæcium)—పువ్వునందుఁ గాయగా మాఱుభాగము. ఇది పువ్వుయొక్క (స్త్రీ) భాగము. 83.

అండత్వక్కు—(Integuments)—అండముయొక్క వెలుపలిచర్మము 128.

అండప్రధానము (Nucellus)—అండముయొక్క ముఖ్యభాగము. 128.

అండము (Ovule)—అండాశయములోపల నుండి గర్భధానమునఁ బిదప విత్తనముగా మాఱునది. 127. 99*.

అండలంబనస్థానము (Placenta)—అండాశయమునం దండము లంటుకొనియుండు తావు. 116.

అండవివరము (Micropyle)—అండమునందలి సన్నరంధ్రము. 129.

అండాకృతి (Ovate)—అండమువలె నుండునది. 73. 51*.

అండాశయ కుడ్య సంయోగము (Parietal placentation)—అండము లండాశయముయొక్క గోడలకుఁ జేరియుండుట. 116. 85.*

అండాశయ పీఠసంయోగము (Basal placentation)— అండము లండాశయముయొక్క క్రిందిపై భాగమునంటుకొని పెరుగుట. 116. 86*

అండాశయ మధ్యస్తంభ సంయోగము (Axile placentation)—అండము లండాశయముయొక్క నడుమనుండు స్తంభమునంటుకొనియుండుట. 116. 84.*

అండాశయము (Ovary)—అండములను లోపలఁ జేర్చుకొనియుండు పూవుపిందె. 83.

అభిముఖ చేరిక (Opposite)—ఆకులొకదాని కొకటి యెదురెదురుగాఁ జేరియుండుట. 75. 53.*

అల్పకణిశము (Spikelet)—ఊంగ, గడ్డి మొదలగు వానియందుండు చిన్న యెన్నులు. 278. 194*, 195*.

అవిదీర్ణ కఠినఫలము——ఎప్పటికిని బగులనికాయ. 151, 114*.

అస్ఫుటదళవంతములు (Incompletæ)—చిన్నవిగాను, కుఱుచవిగాను నుండు దళములును, వెలిదళములును గల పుష్పములు ధరించియుండు చెట్లు. 193.

ఉంగరపుగొట్టము (Annual vessel)—దారువునందుండు నొకవిధమైన గొట్టము. 295. 206.*

కావలికణములు (Guard cells)—పత్రరంధ్ర(స్టోమాట)ముల కిరుప్రక్కల నుండు నర్ధ చంద్రాకారములైన కణములు. 311, 217*.

కాష్ఠనాళకూర్చములు (Vascular bundles)—ప్రకాండశాఖల దంటులలోపలి యమరికలలో నొకభాగము. 230. 206.*

కీటఖాదములు—కీటకభక్షక సస్యములు. 355. 228*.229*.230*.

కీలము (Style)—అండాశయము చివర నంటుకొనియుండు శలాకవంటి భాగము. 83.

కీలాగ్రము (Stigma)—కీలముయొక్క కొనభాగము. 83.

కుటుంబము (Order). 207.

కేసరగొట్టము (Staminal tube)—కేసరములు గొట్టముగాఁ జేరియుండుట. 83. 59*.

కేసరతంతువు (కేసరకాడ) (Filament)—కేసరములందు పరాగంపుతిత్తులు వహించియుండు భాగము. 90.

కేసరములు (Stamens)—పూవులందు మూఁడవ మడుపు భాగము. ఇదియే పూవుయొక్క మగభాగము.

కోఱదంతపు కోఁతయుంచులవి (Dentate)—74. 52* 3.

గడ్డ (Tuber)—భూమిలోపలికిఁ జొచ్చి నిడివిగాక, గిటకపాటియుండు ప్రకాండపు కొమ్మల భేదములలో నొకటి. 42. 25* 26* 27*.

గణుపు (Node)—ఆకులు కొమ్మలనంటులతోఁ జేరియుండుతావు. 13.

గణుపు పుచ్ఛములు (Stipules)—ఆకు యొక్క తొడిమ కడుగున గణుపులకుఁ జేరినట్లుగా నంటుకొనియుండు పుచ్ఛములు (తోఁకలు). 64. 40* 41*.

గణుపుమధ్యభాగము (Internode)—రెండు గణుపులకు మధ్యనుండు దంటుయొక్క భాగము. 13. 8*.

గణుపుసందు (Axil)—ఆకుల తొడిమలకును దంటునకును నడుమనున్న మూల. 13. 3*.

గదిగోడదారి చీలికలు (Septicidal dehiscence)—విత్తనములు వెలువడుటకై కాయలలో గదిగోడలందుఁ గలుగు పగుళ్లు. 149. 163. *

గదిదారి చీలికలు (Loculicidal dehiscence)—విత్తనములు చెదరు నిమిత్తము కాయల గదికి సూటిగాఁ గలుగు పగుళ్లు. 149. 112.*

గుత్తి (Umbel)—పువ్వులు వృంతములతోఁగూడి, మంజరుల తంతువుల కొనలందుఁ జేరియుండు నొక రీతి. 94. 70.*

గెల (Raceme)—పువ్వులు తంతువులు గలవై, నడిమి దంటునందు అడుగు మొదలు కొనవఱకును జేరియుండు నొక పుష్పమంజరి యొక్క తీరు. 93.

జల్లెడ గొట్టములు (Sieve tubes)—కాష్ఠనాళ కూర్చములందలి శణముయొక్క ముఖ్యభాగము. 293. 206.*

జాతి (Genus)—207.

జీవాణువు (Protoplasm)—పాఁగువలె కణములలో వ్యాపించియుండు నొక వస్తువు. 7. 1*.

జీవపరమాణువు లేక జీవాణు ప్రధానము (Nucleus)—జీవాణువునుండి భేదపడి, జీవాణువునందు ఉంటలుగా నిల్చియుండు భాగము. 321.

తల్లి వేరు (Taproot)—మొదట పుట్టినట్టి వేరు. 25. 7.*

తాళపత్రవైఖరి (Palmate)—తాటాకు వలెనున్న, చిన్న యాకులు తొడిమ కొనయందుఁ జేరియుండురీతి. 71. 50.*

తిరుగుడు తీఁగలు (Twiners)—వంటులపైఁ జుట్టుకొను తీఁగలు. 47.*

తుషము (Glume)—తుంగ, గడ్డి వీనియందుండు మాలుపడిన వృంతపుచ్ఛములు. 273. 194* 195.*

తెగ (Species)—207.

త్వక్కు (Epidermis)—పట్టయొక్క పై భాగము. 287. 205.*

దళచుట్టు (Corolla)—పుష్పముయొక్క రెండవచుట్టు. 82.

దళములు (Petals) 82. 63* 66.*

దవ్వ (Pith or Medulla) కాండములోపలి తట్టు నడుమ నున్న మెత్తనైన తెల్లనిభాగము. 280. 201.*

దవ్వరేక (Medullary ray)—దవ్వను, వల్కలమును గలుపు సమూహము. 287. 205.*

దారువు (Xylem or wood) కాష్ఠనాళ సూత్రముల యొక్క గట్టి భాగము. 289. 205* 206.*

దీప్తిజన్యసంయోగ వ్యాపారము (Photosynthesis)—సూర్యరశ్మిసోఁకుటవలన నాకులందు జరుగుపని.

దీర్ఘాకృతి (Linear) నిడివిరూపుగల యొకవిధమైన యాకులరీతి 72. 51.*

ద్రోణీదళములు (Keel)—దోనె వలె నుండు దళములు. 92.

బదనిక వేరు (Parasitic root)—భూమిలోపలికి దిగుటకు బదులుగా మఱియొక చెట్టుకొమ్మలమీఁద వ్యాపించి, దానిలోపలికిఁ జొచ్చి పెరుగునట్టివేరు. 32. 33. 16.*

బల్లెపు రూపు (Lanceolate)—బల్లెమువలె నుండు రూపముగల యాకు. 72. 51.*

బహుభిన్న పత్రము (Decompound leaf)—అనేక చీలికలుగాఁ జీలిన చిన్నయాకులు గల పత్రము. 70. 49.*

బహు విదారణ పుటక ఫలము, లేక విదీర్ణ బహు పుటక ఫలము (Capsule)— అనేకములగు పగుళ్లుగాఁ బగులు కాయ. 149 111* 112.*

బాణాగ్ర రూపము (Sagittate)—బాణపు కొనవంటి రూపముగల యాకు. 72. 51 *

బీజకోశము (Pericarp)—విత్తనములను లోపలఁగలిగి యుండు కాయ యొక్క భాగము. 139. 101.*

బీజత్వక్కు (Seed coats)—విత్తనములలో, అంకురమును, అంకురదళములను లోపల నణఁచి యుంచుకొనియుండు భాగము. 138.

బీజపుచ్ఛము (Aril, Caruncle or Strcphiole)—విత్తనముల కంటుకొనియుండు తోఁకలు. 122, 123.

బీజబంధకము (Funicle)—విత్తనము నండలంబన స్థానముతోఁ జేర్చు భాగము. 138.

బుసము (Palea)— గడ్డియెన్నులోఁ బువ్వులను లోపల నుంచుకొని యుండు భాగము. 276. 197*198.*

మూలవహము (Rhizome)—భూమిలోపలికిఁ జొచ్చి, వేళ్లుపాఱియుండు ప్రకాండభేదము. 40, 41. 19* 20.*

మూలాశ్రితలతలు<br>మూలారోహిలతలు } (Root climbers) వేళ్ల సాహాయ్యముచే నెక్కివచ్చు తీఁగెలు. 51.

రెమ్మకంకి (Compound spike)—102.

రెమ్మగుత్తి (Compound umbel)—102.

రెమ్మగెల (Compound raceme or panicle)—101.

అంపపు పండ్లకోఁత యంచులది—74. 52* 2.

లశునము (Bulb)—ప్రకాండము పొట్టిదయి, తట్టవలెమాఱి, దానిమీఁది భాగమున మాఱుపడిన యాకులను, గ్రిందివైపున వేళ్లను వహించియుండు కొమ్మభేదము. 46. 26* 27.*

లతాప్రతానవంతములు (Tendril climbers)—నులితీఁగెల సహాయమువలన నల్లుకొను తీఁగెలు 49. 31.*

లోపెంకు కండకాయ (Drupe)—బీజకోశముయొక్క లోపలిభాగము గట్టిగాను, పైభాగము మెత్తగాను నుండునది. 145. 107* 108.*

వర్థకావళి .(Cambium)--దారు శణములకు మధ్యనుండు భాగము. చెట్లకొమ్మలు పెరిగి పఱపుట యీ భాగము వృద్ధియగుటచేతనే. 289. 205.*

వలయదంతపు కోఁతయంచులవి (Crenate)—74. 5.

వల్కలము (Cortex)—పట్టలోపలి వలయము. 287, 205*

వలగొట్టము (Reticulate vessel)—దాని భాగమున నొక విధమైన గొట్టము. 295. 206*.

విభక్తాండాశయము (Apocarpous ovary) అండాశయము నందలి గదులు వేర్వేరుగా చీలి, యొక్కొక్క కాయవలెఁ బెరుగునది 115.

విషమరేఖ పత్రము (Reticulated veined leaf)—66. 43 (b)*

వృంతము (Peduncle)—పుష్పముల తొడిమ. 82.

వృంతపరిణామఫలము (Peduncle transformed into false fruit)—వృంతము కాయవలె నిల్చియుండునది. 1[illegible].

వేరువెంట్రుకలు (Root hairs)—వేళ్ల యొక్క చివరి భాగములందుఁ బుట్టు సన్న వెంట్రుకలు. 22, 23. 5* 4.*

వృంత పుచ్ఛము (Bract)—పుష్పముల తొడిమ యొక్క కొనయందుఁ బుష్పకోశము యొక్క యడుగునఁ జేరియుండు రేకులు. 82.

శణము (Phloem)—కాష్ఠనాళ పూర్వములలో నొక భాగము. 289. 205.*

సంయుక్త దళవంతము (Monopetalous)—వేర్వేరుగా నుండక చేరియుండు దళములుగల పూవులు పూయు చెట్లు. 193.

సంయుక్తాండాశయము (Syncarpous ovary)—గదులు వేర్వేరుగా నుండక యొకటిగాఁ జేరియుండు నట్టి యండాశయము. 115.

సమగోళాకారము (Elliptic)—72. 51.*

సమాంచలము (Entire margin)—సరియైన యంచులు గలది. 73. 52.*

సమరేఖపత్రము (Parallel veined leaf)—ఆకుల పెద్ద నరములు వేఱయి మరలఁజేరక యుండు పత్రముగలయాకు. 65. 43 *

సవృంతపుష్పసమూహ పరిణామఫలము (Fig or Synconium) మంజరికాడ గిన్నెవలె మాఱి, దానిలోపలి కాయలన్నియు విత్తనములవలెఁగాన్పడి యంతయు నొక పండువలె నగపడునది. 156. 116

సాధారణ మధ్యారంభి మంజరి (Simple cyme)—మంజరి యందలి మూఁడు పువ్వులలో మొదట నడిమిదియు, వెనుకఁ బ్రక్కల నున్నవియుఁ బూఁచునట్టి మంజరి 99. 75.*

సాధారణమొగ్గ (Normal bud)—కణుపు పుచ్ఛములందుఁ బుట్టిన మొగ్గ. 55.

సాధారణవేరు (Normal root)—తల్లివేరు నుండి పుట్టువేరు. 26.

సామాన్యపత్రము (Simple leaf)—చీలికలు లేక యొక తునుకగానుండు పత్రము. 66. 47.*

సామాన్యఫలము (Simple ovary)—ఒకగది మాత్రము గలిగి, ఒకకీలాగ్రమును, ఒక కీలమును గలయండాశయము. 115.

హరితపత్రరేణువులు (Chlorophyll grains)—ఆకునందుండు నాకుపచ్చని తునుకలు. 285.

హృదయాకారము (Cordate)—72. 51.*

# శుద్ధాశుద్ధ పత్రిక.



| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 9 | కుల | లకు |
| 32 | మొదటిపటము | 16-వ పటము | 15-వ పటము |
| 46 | 3 | చెట్లలలో | చెట్లలో |
| 75 | 7 | వతేనై | వలెనై |
| 86 | 10 | అవ | ఆవ |
| 116 | 17 | తక్కువగానైన | తక్కువగానైనను, హెచ్చుగానైన |
| 117 | 1 | కేసరములు | అండకోశము |
| 122 | 3 | పొప్పొడిని | పుప్పొడిని |
| 171 | 5 | అదిపెరుగువిధము | మొలక పెరుగువిధము |
| 173 | 7 | వాని | దాని |
| 174 | 15 | పైని | క్రింది |
| 182 | 7 | చున్నవి | చున్నది |
| 188 | 2 | తక్కినది | తక్కినవి |
| 200 | 7 | దాని | వాని |
| 205 | 17 | (Acslepiadeæ) | (Asclepiadeæ) |
| 205 | 19 | ములోని | ములలోని |
| 205 | 4 | (Polyalthiya) | (Polyalthia) |
| 208 | 5 | (Anonasquavmosa) | (Anona squamosa) |

# OPINIONS.

"This is an eminently useful manual by Mr. K. Rangachari, M. A., L. T., Assistant, Madras Government Museum, and sometime lecturer in Botany in the Presidency College. The book is intended to serve the purposes of a text book in this subject in Elementary schools. A special merit of the book is that it is not a translation of English text books on Botany having no bearing on Indian conditions, but is entirely original, written by one who is an expert in the higher branches of Botany and has himself carried on original researches in this line. All the illustrations are drawn from the orders of plants met with everywhere in India; and this has enabled the author to realise his main aim in writing the book, viz., to present to the Tamil speaking people in their every day language an account of the main features of plant life. The method adopted by Mr. Rangachari in the treatment of the subject is calculated to achieve the object he has set before himself. This book anticipates the need which is sure to arise in connection with the new system of rural schools in the Presidency inaugurated by the Hon'ble Dr. Bourne, where children of the agricultural classes are intended to be trained in nature-study by observation of plant life in school gardens, which are to be a special feature of the schools; and one cannot conceive a more fascinating subject of study for an Indian child, under proper direction and guidance, than elementary botany."

*Madras Mail.*
*May*, 1908.

"The author of this book has aimed to produce a text book for the use of teachers in Elementary Schools, such as shall aid them in the introduction of nature-study to their pupils. He has aimed to give an account of the main features of plant life as seen in flowering plants, in the every-day language of Tamil speaking people. His illustrations have been drawn only from the commonest plants such as are within the reach of all. The descriptions of the parts and functions of plants are in simple language, well expressed in idiomatic Tamil. If a text book on Botany in the vernacular is worth doing at all, this book is an example of one that is well done. The topics selected for study are within the reach of all: the language is simple: the illustrations are original, and fresh and effective for their purpose: and the letter press and the general get up of the book, admirable. Chapter 12 and 13, imply the use of the microscope, which few teachers in elementary schools, would be likely to possess, or be able to afford."

*The Madras Christian College Magazine*
*June*, 1908.

